తెలుగులోనే అన్నివ్యవ
హారాలు జరపడానికి
తిరుమలై బోర్డు నిర్ణయం
— 3 వ పేజీ

# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA-MADRAS. సంపుటం 41. సంచిక 184 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 8-10-1954 Reg. No.M. 1118 8 పేజీలు వెల 1 అణా

# ఫ్రెంచి ఇండియా స్థావరాల అప్పగింతకు కార్యక్రమం నిర్ణయం

## "అవసరమైతే రాజ్యాంగాన్ని సవరణ చేసి అయినా అభివృద్ధి సాధించాలి"

### భారత ప్రభుత్వ స్థిరసంకల్పం: ప్రధాని నెహ్రూ స్పష్టీకరణ

#### మూడురోజుల నౌకాయాన సమాప్తి

బొంబాయి, అక్టోబరు 6: భారత దేశమును శీఘ్రగమనమున శ్రేయోరాజ్యంగా మార్చడానికి భారత దేశం కృత నిశ్చయమై వున్నదనీ, దేశ ఆర్థికాభివృద్ధి మరింత శీఘ్రంగా జరగవీలవడానికిగాను అవసరమైతే భారత రాజ్యాంగాన్ని సవరించడమవుతుందనీ ప్రధాని నెహ్రూ ఈవేళ యిక్కడ వాగ్దానం చేశారు.

మూడురోజుల సముద్ర విహారానంతరం ఈరోజు ఉదయం యిక్కడికి వచ్చిన ప్రధాని నెహ్రూ ఉత్తర బొంబాయిలో ఒక సభలోనూ, ఇక్కడికి 75 మైళ్ళ దూరంలో నైతరణీవద్ద మరొక సభలోనూ ఉపన్యసిస్తూ దేశ ఆర్థికాభివృద్ధికిన్నీ, శ్రేయోరాజ్య లక్ష్యమును అందుకోడానికి తన ప్రభుత్వం చేస్తున్న కృషికిన్నీ ప్రజలు తోడ్పడవలసిన ఆవశ్యకతను స్పష్టం చేశారు.

బొంబాయి ఉత్తర పరిసరమైన చెంబూరులో టాటా సాంఘిక శాస్త్రాల అధ్యయనసంస్థ నూతన భవనమును ప్రారంభిస్తూ చేసిన ఉపన్యాసంలో మాత్రం ఆయన ఒక అంతర్జాతీయ సమస్యనుగూర్చి జాతి విద్వేషమును గూర్చి విపులంగా ప్రసంగించారు. 'ఈనాడు అత్యంత ప్రాధాన్యం వహిస్తున్న ఈ సమస్య పరిష్కారమయ్యే సూచన లేవీ కనిపించడంలేదు. ఈ సమస్య త్వరలో పరిష్కారం కాకపోతే ప్రపంచం కష్టాలపాలు కాక తప్పదు. మానవులు మానవులపట్ల ప్రవర్తించదగిన విధమున ప్రవర్తించినప్పుడే వ్యక్తులకు వ్యక్తులకూ మధ్యా వర్గాలకు వర్గాలకూ మధ్య సర్దుబాటు జరిగినప్పుడే ఈ సమస్య పరిష్కారమవుతుంది' అని ...

... ఆరోగ్య పథకాన్ని ప్రారంభించ ప్రభుత్వంవారు గాఢంగా వాంఛిస్తున్నారని ప్రకటించారు. 'మన ప్రస్తుత పరిస్థితినిబట్టిచూస్తే యిది స్వప్నతుల్యమైనదిగా, హాస్యాస్పదమైనదిగా కనిపించవచ్చు. యీ బ్రహ్మాండమైన కార్యానికి ద్రవ్యలోపం అడ్డురావచ్చు కాని శ్రేయోరాజ్యస్థాపనకు మనం బద్ధకంకణులమై వున్నాము. ఉత్తరోత్తరా యిట్టి పథకం అమలులోనికి రాక తప్పదు' అని వివరించారు.

సాంఘిక భద్రతకు యిది మొదటి చర్య అని కేంద్ర కార్మికశాఖ మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయి అన్నారు.

**మిషనరీల కార్యకలాపాలు**

కొండజాతి ప్రజల జీవిత విధానాన్ని సంస్కరించడానికి మిషనరీలు అవలంబిస్తున్న పద్ధతిని ప్రధాని నెహ్రూ ఈవేళ యిక్కడ నిరసించారు.

టాటా సాంఘిక శాస్త్రాధ్యయన శాఖల కొత్త భవనాన్ని ప్రారంభిస్తూ ఈశాన్య సరిహద్దు ప్రాంతాలలో మిషనరీ కార్యకలాపాల విషయమునను కాంగ్రెసువారు ప్రారంభించిన ఆక్రమం విషయమునను ఆందోళనకరమైన వార్త వచ్చిందని చెప్తూ ఇలా ...

## ఈజిప్టులో ఇజ్రేలి గూఢచారులు

### సూయజ్ ఒప్పందాన్ని భగ్నపరిచే ప్రయత్నం

లండన్, అక్టోబరు 6: ఈజిప్టులో విద్రోహకర కార్యకలాపాలు సాగిస్తున్న ఇజ్రేలీ గూఢచారుల ముఠా నొకదానిని ఈజిప్టు భద్రతాదళాలు ఛేదించినవని ఈజిప్టు ఆంతరంగిక వ్యవహారాల మంత్రి కల్నల్ జకారియా మొహిదీన్ ప్రకటించినట్లు, కైరో రేడియో నేడు తెలియచేసింది.

సూయజ్ మండలాన్ని బ్రిటిష్ వారు ఖాళీచేసి పోవడానికి ఏర్పాటు అయిన ఒప్పందం సమయంలోనే, వెంటనే విద్రోహకర కార్యకలాపాలు మొదలుపెట్టి, దేశంలో ...

## ఉభయపక్షాల పూర్తి ఒప్పందం: విలీన సమస్యపై మునిసిపల్ కౌన్సిలర్ల ఓటింగు

### ఏడాది తాత్కాలికపాలన సాగినపిమ్మట ఎన్నికలు: శాంతిభద్రతల రక్షణకు భారత పోలీస్ బృందం

పుదుచ్చేరి, అక్టోబరు 7: ఫ్రెంచి ఇండియా స్థావరాలను భారత ప్రభుత్వానికి అప్పగించే విషయమై భారత దేశం, ఫ్రాన్సులమధ్య పూర్తి ఒప్పందం కుదిరిందనీ, అధికారం బదిలీచేయడం మొదలైన వివరాలన్నిటిపైనా తుది నిర్ణయాలు జరిగినవనీ ఇక్కడి అభిజ్ఞవర్గాలవారు విశ్వసిస్తున్నట్లు యు. పి. ఐ. ప్రత్యేక విలేఖరి వ్రాస్తున్నాడు.

ఈ వివరాల ప్రకారం, ఈ క్రింది విషయాలు తెలియవచ్చాయి: ఫ్రెంచి ఇండియాను ఇండియాలో విలీనం చేయడంపై వలసలలోని మునిసిపల్ సంఘ సభ్యులంతా ఓటు చేస్తారు. కారైకాల్ గ్రామంలో జరిగే ఈ ఓటింగుపై ఒక ఫ్రెంచి న్యాయమూర్తి భారత కౌన్సల్ జనరల్, మహ్యా పియర్ లాండేగారు పర్యవేక్షణ చేస్తారు.

... ఉద్యోగులూ, కొందరు అధికారులూ పుదుచ్చేరికివెళ్లి శాంతిభద్రతల పరిరక్షణ బాధ్యత వహిస్తారు.

పుదుచ్చేరిలో ఉన్న ఫ్రెంచి కళాశాలను ఫ్రెంచి ప్రభుత్వమూ, మిగతావాటన్నిటినీ భారత ప్రభుత్వమూ నిర్వహించేవిషయమై కూడా ఒప్పందం కుదిరిందని తెలుస్తూంది.

### ఇండోచైనాలో నెహ్రూ కార్యక్రమం

సైగాన్, అక్టోబర్ 6: పెకింగ్ నుంచి ఢిల్లీకి తిరిగివచ్చేదారిలో అక్టోబర్ 30 వ తేదీనాడు ప్రధాని నెహ్రూ సైగాన్ వస్తారని గట్టిగా తెలుస్తున్నది. ఆ రోజు అక్కడ వియత్నాం ప్రధాని, విదేశాంగమంత్రులతో ఆయన సంప్రదించి మర్నాడు కాంబోడియారాజు ఆతిథ్యాన్ని స్వీకరించేందుకు ఫ్నాంపెన్ వెడతారు. కాంబోడియాలో నెహ్రూ అంకోర్ వాట్ వద్ద శిల్ప శ్వేత శైథిలశిలాలను సందర్శిస్తారు.

## బుద్ధిబలానికీ అస్త్రబలానికీ వైరుధ్యం

### తొలగినప్పుడే ప్రపంచ శాంతి సాధ్యమని డా॥ రాధాకృష్ణ ఉద్బోధ

## కమ్యూనిజం వ్యాప్తికి కర్షకుల ప్రతిఘటన

### ప్రపంచ రైతుసభలో రంగాగారి ఉద్బోధ

### అరబ్ ఇజ్రేల్ నిరాక్రమణ ఒప్పందాలు

## ట్రీస్టీ ఒప్పందంపై వాల్గు రాజ్యాల సంతకాలు

### తొమ్మిదేళ్లుగావున్న క్లిష్ట సమస్య పరిష్కారం

### మాలెంకోవ్‌తో స్వతంత్ర చంద్రశేఖరన్ గోష్ఠి

## జర్మనీలోని ఆక్రమణ సేనలకు ఉద్వాసన

### వెంటనే ఒప్పందం కుదుర్చుకోవాలని పశ్చిమరాజ్యాలకు మాలటోవ్ సూచన

బెర్లిన్, అక్టోబర్ 6: తూర్పు, పశ్చిమ జర్మనీల నుంచి ఆక్రమణ సేనలను ఉపసంహరించే విషయమై తక్షణం ఒప్పందం కుదుర్చుకోవాలని సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్ నేడు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులకు ప్రతిపాదించారు. ఈ సం॥ మొదట్లో బెర్లిన్ సమావేశంలో చేయబడ్డ ప్రతిపాదనలనూ, స్వేచ్ఛగా అఖిల జర్మన్ ఎన్నికలను జరిపించటానికి వచ్చే ప్రతిపాదనలనూ చర్చించటానికి రష్యా సిద్ధంగా ఉన్నదని ఆయన వెల్లడించారు.

"అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులకు జర్మనీనుంచి ఆక్రమణ సైన్యాలను ఉపసంహరించేందుకు తక్షణం ఒప్పందం చేసుకోవాలనీ రష్యా తిరిగి నేడు మరొకసారి ప్రతిపాదిస్తున్నది. ఇందులో ఆలస్యం ఎంతమాత్రమూ వనికిరాదు. ఆక్రమణ సేనల ఉపసంహరణ జర్మన్ ప్రజలందరికీ మేలు కలుగ ...



పశ్చిమ జర్మనీ అధ్యక్షుడు అడినార్



# లిబియా మంత్రి హత్య

## బెన్‌ఘాజీలో అవాంతరస్థితి

కైరో, అక్టోబరు 6: లిబియా రాజభవన వ్యవహారాల మంత్రి సయద్ ఇబ్రహీంషాల్హీ నిన్న హత్యచేయబడ్డాడు. ఇందుపై, బెన్‌ఘాజీఅంతటా అవాంతరస్థితి ప్రకటించబడినదని వార్తలు వచ్చినట్లు ప్రభుత్వవర్గాలవారు అన్నారు.

ఆ మంత్రి బెన్‌ఘాజీలో ప్రభుత్వ భవనముందు నిలచియుండగా పిస్తోలు పేల్చి ఎవరో హత్యచేశారట. లిబియా రాణి మేనల్లుడు సయద్ షరీఫ్ ముహీదీన్‌సెనూసీని దరిమిలాను పోలీసులు అరెస్టు చేశారు.

(1951 డిసెంబరు 24 న మహమద్ ఇద్రిస్ ఎల్ సెనూసీ లిబియాకు రాజుగా ప్రకటింపబడ్డాడు. ఆయనకు ఒక్క కొడుకు పుట్టాడు. ఆ ఒక్కడూ పుట్టుకలోనే మరణించాడు. అందువల్ల రాజు సోదరుడైన ఎమీర్ మహమదీ సింహాసనానికి వారసుడుగా ప్రకటించబడ్డాడు. రాజుకి కొడుకు పుట్టినట్లయితే ఈ వారసత్వం పోతుంది.)

### రైసుమిల్లు వేలము

ఒంగోలు సబ్ కోర్టు O. S. 76/53 దావా డిక్రీలు దాఖలా తిమ్మసముద్రం గ్రామములోని శ్రీ మహాలక్ష్మి రైసుమిల్లు ఆవరణము య 2-46 సెంట్లు, మిల్లుకు సంబంధించిన మిషినరీ, కట్టడములు, ఫర్‌నిచరు వగైరా యావత్తు కోర్టువారి ఉత్తర్వు మేరకు జావలన 17-10-54 తేది పగలు 12 గంటలకు మిల్లు వద్ద బహిరంగమైన వేలముద్వారా విక్రయించబడును. కొనదలచినవారు సైకములో హాజరు కావలెను. ఆ సినిపరీక్ష చేయదలచినవారు 9-10-54 తేది పగలు 11-3 గంటల మధ్య మిల్లువద్దకు రావలెను. ఇతర వివరములకు రిసీవరు గారిని కలుసుకోవలెను.

ఒంగోలు. } సి. గోపాలరావు,
1-10-54. } బి.ఏ., బి.ఎల్., రిసీవరు.





# ఆంధ్రలో ప్రభుత్వ పరీక్షలు

## కమిషనర్ కార్యదర్శి ప్రకటన

మదరాసు, అక్టోబరు 4: ఆంధ్ర ప్రభుత్వ పరీక్షల కమిషనరు కార్యదర్శి శ్రీ యస్. వేణుగోపాలనాయుడు గారు యిలా వ్రాస్తున్నారు.

1955 మార్చి 23, 24, 26 తేదీలలో టి. యస్. యల్. సి. పరీక్షలు జరుపబడుతాయి. అభ్యర్థులు తమ దరఖాస్తులను యీ అక్టోబరు 15 వ తేదీలోగా మౌబ్రేస్‌రోడ్డు నెం 15 గృహమందలి కమిషనర్ కార్యదర్శికి అందజేయాలి. 31 వ తేదీ వరకు ఒక రూపాయి అపరాధ రుసుముతో దరఖాస్తులు పంపవచ్చు. పరీక్షకు సంబంధించిన వివరాలను త్వరలో వెలువడు ఆంధ్ర గెజెటులో చూడవచ్చు.

## యస్. యస్. యల్. సి. పరీక్ష

1955 మేలో జరిగె యస్. యస్. యల్. సి. పరీక్షకు కూర్చో దలచే అభ్యర్థులు ఆంధ్రరాష్ట్రంలో ప్రభుత్వ ఖజానాలో దేనిలోనైనా రుసుము చెల్లించి యీ నెల 31 వ తేదీలోగా తమ దరఖాస్తులను ఆంధ్రరాష్ట్ర సెకండరీ విద్యాబోర్డు కార్యదర్శికి పంపాలి.

# పాఠశాలలలో హిందీబోధన

## వారానికి 3 పీరియడ్లు చేయాలని విజ్ఞప్తి

కర్నూలు, అక్టోబరు 5: పాఠశాలలో హిందీ బోధనను వారానికి రెండు పీరియడ్లనుంచి మూడు పీరియడ్లకు పెంచాలని కృష్ణా జిల్లా ఉపాధ్యాయ సంఘం వారు కార్యదర్శి యం. శ్రీరాములుగారి నాయకత్వాన ఆంధ్ర విద్యాశాఖ కార్యదర్శి వద్దకు వెళ్లి విజ్ఞప్తి దాఖలు చేసుకొన్నారు. ఇందువల్ల 17 మంది జిల్లా బోర్డు హిందీ ఉపాధ్యాయులకు ఊడిపోయిన ఉద్యోగాలు ఊడిపోకుండా ఉండగలవని వారు తమ విజ్ఞప్తిలో తెలియజేశారు. తగినంత పనిలేదన్న కారణంతో వారిని ఈ అక్టోబరు 1-వ తేదినుంచి ఉద్యోగాలనుంచి తొలగిస్తూ నోటీసులు జారీ చేయబడినవి.

చేతి పనుల శిక్షణలో యోగ్యతాధికారం పొందని ఉపాధ్యాయులకు 1953 జూలై 22 తేదినుంచి ఇంక్రిమెంట్లు నిలిపి యుంచబడినవనీ, అందువల్ల చాలామంది ఉపాధ్యాయులు కష్టపడుతున్నారనీ, కాబట్టి చేతి పనుల శిక్షణలో యోగ్యతాధికారం పొందడానికి పెట్టిన గడువును 1955 జూలై దాకా పెంచాలని కూడ వారు కోరారు. ఈలోపల వారికి యథాప్రకారం ఇంక్రిమెంట్లు ఇప్పించాలని కూడా అడిగారు.

## మందపాకల కాల్వ

బందరు, సెప్టెంబరు 29: దివితాలూకా మందపాకల మాగాని భూములకు నీటి సరఫరా నిమిత్తం పి. డబ్ల్యు. డి. అధికారులు సిఫార్సు చేసిన కాల్వ స్కీమును అమలు పరచాలనీ, ఈ కాల్వ ఖర్చులో సగమో లేదా మూడింట రెండో వంతులో మూడో, వాళ్లో పాలీనా వాయిదాల మీద ప్రభుత్వానికి చెల్లిస్తామని వ్రాసి యిచ్చామని మందపాకల గ్రామ ప్రజలు ఇటీవల రెవిన్యూమంత్రికి విజ్ఞప్తిని సమర్పించారు. నాగాయిలంక-కోడూరు రోడ్డును కంకరచేసి బస్సు సర్వీసు వెయ్యాలనీ, అవనిగడ్డ-కోడూరురోడ్డుపై బస్సు సర్వీసు మంజూరు చెయ్యాలనీ, రత్నకోడును చేర్చ మురుగుకాల్వలు తమ గ్రామంనుంచి త్రవ్వించాలనీ కోరారు. (స్వ. వి.)

## చేనేత వస్త్రాల అమ్మకాలపై రిబేటు

నిడ్మబోలు, సెప్టెంబరు 30: చేనేత సహకార సంఘాలలోనూ, వెలుపల అమ్మక మగుచున్న చేనేత వస్త్రాల అమ్మకాలపై రిబేటు ఇవ్వటం అవసరమనీ, జిల్లా కలెక్టర్ నిర్ణయించిన చేనేత వస్త్ర వ్యాపారస్థులకు కూడా రిబేటు యిచ్చి చేనేత పారిశ్రామికులకు తోడ్పడాలనీ, రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుందని భావిస్తున్నామనీ ఆంధ్రరాష్ట్ర చేనేత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ప్రగడ కోటయ్యగారు తెలియచేస్తున్నారు.

## హరిజనులకు బంజరు భూముల పంపకం

కాకినాడ, సెప్టెంబరు 30: బంజరు భూముల పంపకంలో హరిజనులకు అన్యాయం జరుగకుండా, వారికి భుక్తి కలుగజేయాలని తూర్పుగోదావరిజిల్లా హరిజన సంఘం తరఫున బొజ్జా అప్పలస్వామి, సాక సూర్యచంద్రరావు, రెడ్డి కామయ్య, ఈ. వాసెపల్లి, యేడిద నారాయణమూర్తి, ఎల్లా వీర్రాజు, పచ్చిపాల రామస్వామి, చీవి సూర్యరావుగారలు రెవిన్యూమంత్రి కోటిరెడ్డిగారు ఇక్కడకు ఇటీవల వచ్చిన సందర్భంలో ఒక విజ్ఞప్తిని సమర్పించారు. సాక సూర్యచంద్రరావుగారు జిల్లాలోని హరిజనుల పరిస్థితులను వివరించారు.

# గాంధీ జయంతి

### గోపువాని పాలెం

గోపువానిపాలెం సర్వోదయ సమాజంలో గాంధీజయంతి అతివైభవంగా జరుపబడింది. బాల బాలికలకు పండ్లు, కొబ్బరి, బెల్లం, పంచబడినాయి.

### వినయాశ్రమం

గాంధీ జయంత్యుత్సవాలు 5 గంటలకు ప్రార్థనతో ఇక్కడ ప్రారంభమైనాయి. ప్రభాతభేరీ, సూత్రయజ్ఞం, బహిరంగసభ జరిగినాయి. శ్రీ తుమ్మల బసవయ్య, దుర్గాంబ గారలు సూత్రయజ్ఞానికి ఆధ్వర్యం వహించారు.

### ద్రాక్షారామ

ఇక్కడ గాంధీజయంతినాడు నగర సంకీర్తనం చేయబడింది. కాంగ్రెసువాదులు శ్రీ భీమేశ్వర స్వామివారి ఆలయంలో ప్రార్థనలు జరిపారు.

### ఏలూరు వెనుకబడినజాతుల సభ

బాపూజీ జన్మదినోత్సవాలు చేయటానికిగాను వెనుకబడు జాతుల సభ ఏలూరులో జరిగింది. శ్రీ యం. రాములుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు కె. సత్యనారాయణ, జి. వెంకటరత్నం, కెశివబ్రహ్మం, ఎ. నాగేశ్వరరావు, జి. సింహాద్రి, జి. పోతురాజు, ఉరిటి రామయ్యగారలు ఉపన్యాసాలు చేశారు.

### భీమవరం

స్థానిక యస్. కె. జి. యం. ఉన్నత పాఠశాలలో గాంధీ జయంత్యుత్సవం జరుపబడింది. ప్రధానోపాధ్యాయులు శ్రీ వి. వి. అప్పయ్యగారు పతాకావిష్కరించారు.

ఉమా సోమేశ్వర రైసుమిల్లు యజమానులు బీదలకు అన్నదానం చేశారు. దాదాపు 5000 మంది బీదలు సంతృప్తులైనారు.

### ఆలపాడు

శ్రీ వేణుగోపాల స్వామివారి ఆలయంలో ఇక్కడ గాంధీ జయంత్యుత్సవసభ శ్రీ తన్నీరు శివమూర్తిగారి అధ్యక్షతన జరిగింది. శ్రీ ధనకుధరం వరదాచార్యులు గారు, శ్రీ మతుకుమల్లి లక్ష్మీనరసింహారావు గారలు ప్రసంగించారు. శ్రీ ఖాండూరు వెంకయ్యగారు వందనసమర్పణ చేశారు.

### గుంటూరు

'ఆంధ్రసంసత్' వారు గాంధీ జయంత్యుత్సవాలను హిందూ కళాశాల పఠన మందిరంలో వైభవంగా జరిపించారు. శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘంవారి దివ్యసంకీర్తనంతో ఉదయం 8 గంటలకు ప్రారంభమైన ఈ ఉత్సవ సందర్భంలో శ్రీ వారణాసి రామమూర్తిగారు ప్రసంగిస్తూ సూత్రయజ్ఞ ప్రాశస్త్యం, వేదములలో నిర్వచింపబడిందనీ, గాంధీజీ బోధలు వేదసమ్మతాలనీ వివరించారు. శ్రీ యం. వి. శేషగిరిరావుగారు గాంధీజీ దివ్యపురుషుడని కీర్తించారు. సాయంత్రం శ్రీ భేతనభొట్ల శ్రీహరిగారి వేద ప్రవచనం పిదప, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు చింతమనేని భావయ్య గారలు గాంధీజీ ప్రపంచానికి ఆదర్శ వ్యక్తి అని ప్రశంసించారు. శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖర ంగారి సంగీత కచ్చేరి జరిగింది. శ్రీయుతులు సి. హెచ్. సుబ్బయ్య పిడేలు, యం. గురుస్వామి మృదంగం వాయించారు. పౌరశిక్షణ శిబిరంవారు సూత్రయజ్ఞంలో పాల్గొన్నారు. కార్యదర్శి వందనాలతో ఉత్సవం జయప్రదంగా ముగిసింది.

హిందూ హైస్కూలు లైబ్రరీకి పూర్వవిద్యార్థి శ్రీ శిరం సుబ్బారావు నాయుడుగారు నవజీవన్ ప్రచురణలను అన్నింటిని గాంధీజయంతి సందర్భంలో బహూకరించారు. ఈ సమావేశంలో శ్రీయుతులు టి. నాగభూషణంగారు, శ్రీ కృష్ణమాచార్యులు, ఎ. సీతాపతి రావుగారలు పాల్గొన్నారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. హనుమంతరావుగారు కృతజ్ఞత తెలిపారు.

### పామర్రు

గ్రామ కాంగ్రెసు కార్యదర్శి అధ్యక్షతన గాంధీజయంతి ఉత్సవాలు జరిగినాయి. శ్రీయుతులు కె. దుర్గామల్లికార్జునరావు, టి. తిరుమలరావుగారలు ప్రసంగించారు.

### పెరవలి

ఇక్కడి జయంత్యుత్సవాలకు నిర్మాణ కార్యకర్తలు శ్రీ టి. నారాయణమూర్తిగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు పి. శేషయ్య, బర్ల జగన్నాథస్వామిగారలు ప్రసంగించారు. రాత్రి విద్యార్థులు నాటక ప్రదర్శనములు జరిపారు.

### క్రిష్ణాయపాలెం

ఉదయం 8 గంటలకు గాంధీ చిత్రపటం ఊరేగించడంతో జయంత్యుత్సవాలు ఆరంభమైనాయి. తిరువాత బహిరంగసభ జరిగింది. శ్రీ యస్. రామచంద్రరావుగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు పి. శేషయ్య, పి. సుబ్బారావు, టి. సుబ్బారావు, సి. రామారావు, గోపాలకృష్ణమూర్తి, వి. సత్యనారాయణమూర్తి, వి నాయకరావు, సి. శేషయ్య, శ్రీమతి ఏ. మహలక్ష్మిగారలు పాల్గొన్నారు. గాంధీ విగ్రహప్రతిష్ఠ చేయబడింది.

### కోదూరు

జనితాలూకా కోడూరులో గాంధీ పటం ఊరేగించబడింది. గ్రామ పెద్దలు శ్రీయుతులు పి. రామయ్యలు, డి. కృష్ణమూర్తి, కె. పిచ్చయ్య, యం. వెంకయ్య, పి. భూమయ్య మొదలయినవారు పాల్గొన్నారు. స్థానిక కాంగ్రెసు కార్యాలయంవద్ద హరికథా కాలక్షేపం జరిగింది. పిల్లలకు ఫలహారాలు పంచి పెట్టారు.

### బాలమూరు

స్థానిక రామకృష్ణ శారదా సమాజంవారు ఏర్పాటుచేసిన గాంధీజయంత్యుత్సవాలకు శ్రీ బి. వి. నరసింహారావుగారు అధ్యక్షత వహించారు శ్రీయుతులు యం. వి. చలపతి, డా॥ పి. వి. కేశవరావు, వై. వి. శర్మ, వై. సంజీవరావు, సంజీవశర్మ, డి. వెంకట్రామయ్యగారలు ప్రసంగించారు. వి. అప్పావధాని వందన సమర్పణతో సభ ముగిసింది.

### జోడవరం

స్థానిక ఉన్నత పాఠశాలావరణలో జరిగిన జయంత్యుత్సవాలకు కె. వి. నరసింహంగారు అధ్యక్షత వహించారు. శ్రీ బి. జి. అప్పారావుగారు ప్రసంగించారు. శ్రీ వి. సర్వేశ్వరరావుగారు వందన సమర్పణచేశారు. రాత్రి 'రిక్షావాడు' నాటిక ప్రదర్శించబడింది.

### నరసాపురం

గాంధీజీ చిత్రపటం పురవీధుల్లో ఊరేగించారు. స్థానిక టేలర్ స్కూలు విద్యార్థులు శ్రీ జి. చిట్టి రాధాకృష్ణగారి అధ్వర్యాన సూత్రయజ్ఞం జరిపారు. శ్రీ యం. జగన్నశాస్త్రిగారి అధ్యక్షతన సభ జరిగింది. శ్రీయుతులు వీరాస్వామిరాజు, వె. పిచ్చయ్య, పి. శేషావతారంగారలు ప్రసంగించారు.

'సాంస్కృతిక సాంఘిక పరిషత్తు' వారు కళాశాల హాలులో శ్రీ మల్లాది రామమూర్తిశాస్త్రిగారి అధ్యక్షతన సభ జరిపారు. శ్రీయుతులు చెదలవాడ పిచ్చయ్య, జగన్నశాస్త్రిగారలు గాంధీజీకి జోహార్లు అర్పించారు.

శ్రీ వి. సుబ్రహ్మణ్యంగారు వందనాలు చెప్పారు.

### ఉయ్యూరు

స్థానిక పాలిటెక్నిక్ విద్యాలయంలో గాంధీజీ జయంతి ఉత్సవం జరపబడింది. జాతీయపతాకాన్ని ఆవిష్కరించారు.

### కాళహస్తి

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో సర్వమత సమన్వయంగా హిందూ, మహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనలు జరుపబడ్డాయి. సాయంత్రం గాంధీజీ చిత్రమును ఊరేగించారు. తరువాత జరిగిన బహిరంగసభకు శ్రీ పి. వీరరాఘవయ్యగా అధ్యక్షత వహించారు. శ్రీయుతులు యం. యస్. రావు, బాలాజీదాసు, సి. ఈశ్వరయ్య చెట్టి గారలు పాల్గొన్నారు.

### బందరు

ఇక్కడ గొడుగుపేటలో వెంకటేశ్వరం విద్యాలయంలో మహిళా సంఘంవారు శ్రీమతి యస్. రంగమ్మగారి అధ్యక్షతన గాంధీ జయంతి జరిపారు. కుమారి యం. రంగమణి, కాంచన, విద్యుల్లతాదేవి యస్. లక్ష్మీనరసమ్మగారలు గాంధీజీ ఆదర్శాలను గురించి ప్రసంగించారు. రఘుపతి రాఘవ కీర్తన గానం చేయబడింది.

### నరేంద్రపురం

శ్రీ సుబ్రహ్మణ్య బోర్డు హైస్కూలులో శ్రీ ఎ. రామమూర్తిగారి అధిపత్యాన గాంధీజయంతి జరిపారు. పతాకవందనం పిదప శ్రీ దల్లా సుబ్రహ్మణ్యంగారు అహింసను గురించి ప్రసంగించారు. పిల్లలకు మిఠాయిలు పంచారు.

### వరంగల్లు

జంగేటి వెంటయ్యగారి భవనంలో సూత్రయజ్ఞంతో గాంధీజీ జయంత్యుత్సవ కార్యక్రమం ప్రారంభమైంది. హనుమకొండనుండి పద్మాక్షీ దేవాలయంవరకూ రోడ్డు నిర్మాణ కార్యక్రమమూ, ఖాదీ హుండీల విక్రయ కార్యక్రమమూ, ఖాదీ భండార్ ప్రారంభోత్సవమూ గ్రామ పునర్నిర్మాణశాఖా మంత్రి శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ గారిచే జరుపబడింది. భారత సేవక సమాజ ఆధ్వర్యమున ఒక టి. బి. ఆసుపత్రి నిర్మాణము కూడా ప్రారంభించబడింది.

రాత్రి టి. హయగ్రీవాచారి గారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. మేజర్ రంగస్వామి, భండారు చంద్రమౌళీశ్వరరావు, హయగ్రీవాచారిగార్లు ఖాదీ ప్రాధాన్యతనుగూర్చి, గాంధీజీ ఆశయాలనుగూర్చి ముచ్చటించారు.

### మహబూబ్‌నగరం

మాధ్యమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు కృష్ణమాచారిగారి అధ్యక్షతను సభ జరిగింది. విద్యార్థి సంఘ అధ్యక్షుడు కిషన్‌జీ, సుదర్శనం, అనంతరావు మున్నగు విద్యార్థులు బాపూజీ జీవితంనుంచి నేర్వవలసిన అంశాలపై చక్కగా మాట్లాడారు. శ్రీ శ్రీనివాసరావు, రాధాకృష్ణమూర్తి పంతుళ్ల దర్శకత్వం క్రింద 'మెట్టెక్కితే' అనే ఒక ప్రహసనం కూడ ప్రదర్శింపబడింది.

# ఆంధ్ర ఆయుర్వేద పరిషత్తు మహాసభలు

విజయవాడ, అక్టోబరు 4: 21 వ ఆంధ్ర ఆయుర్వేద పరిషన్మహాసభలు ఈ నెల 16, 17, 18 తేదీలలో విజయవాడ గవర్నరుపేటలో కొత్త సినిమా హాలులో జరుపబడవి, దీనితోపాటు రిజిస్టర్డు ఆయుర్వేదవైద్యుల మహాసభ, పట్టభద్రుల మహాసభ, ఫార్మసీల మహాసభ, వైద్య విద్యార్థి మహాసభలు, రిజిస్టరుకాని వైద్యులమహాసభలు గూడా జరుగుతవని ఆహ్వానసంఘంవారు ప్రకటించారు. ఆర్థికమంత్రి శ్రీ వేమ్మెటి పిచ్చయ్యగారు ఈ మహాసభలకు హాజరవుతారు. (స్వ. వి.)

# కేశవపల్లికాల్వ స్కీము

## చీఫ్ఇంజనీరు పరిశీలన

రాజోలు, సెప్టెంబరు 26: ఇరిగేషన్ చీఫ్ ఇంజనీరు వెంకటకృష్ణ అయ్యర్ గారు ముల్కిపల్లి రహదారి బంగళాకు 24 వ తేదీన ఉదయం వచ్చారు. కేశవపల్లికాల్వ సైఫన్‌స్కీమును మాచివచ్చారు. తిర్వాత జీపులో వల్లి అంతర్వేదిపాలెంవద్ద అడ్డాలపాలెం కాల్వ తీమాడలింగు స్కీమును పరిశీలించారు. అక్కడినుంచి సాయంత్రానికి నర్సాపురం వెళ్లారు. ఇంజనీరుగారితో రుద్రరాజు రామలింగిరాజు, సూరిశెట్టి వెంకటస్వామినాయుడు, అల్లూరి వెంకటరామరాజు, అల్లూరి సుదినెంకటసూర్యనారాయణరాజు గారలు కూడా పాల్గొన్నారు.

## వేటపాలెం వైద్యశాల అభివృద్ధి

వేటపాలెం, సెప్టెంబరు 28: గుంటూరుజిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరు పర్సనల్ అసిస్టెంటు సత్యనారాయణ చౌదరిగారు ఇటీవల ఇక్కడకువచ్చిన సందర్భంలో ప్రస్తుతం ఇక్కడఉన్న డిస్పెన్సరీని అభివృద్ధి చేయమని స్థానిక ప్రముఖులు కోరారు. మంచాలు మున్నగువని తక్షణం వృద్ధిచేయటంద్వారా ఆసుపత్రిగా అభివృద్ధిచేయ వీలున్నదనీ, అలా చేయగలమని చెప్పినారనీ అధ్యక్షులు పల్లపోలు సాంబయ్యగారు తెలియజేస్తున్నారు.

## అనంతపురం వ్యాయామ విద్యాసంఘ సమావేశం

అనంతపురం, సెప్టెంబరు 28: అనంతపురంజిల్లా వ్యాయామ విద్యాసంఘ సమావేశం ధర్మవరం బోర్డు ఉన్నత పాఠశాల ఆవరణలో సంజా నారాయణప్పగారి అధ్యక్షతన ఇటీవల జరిగింది. వ్యాయామవిద్య రీజినల్ ఇనస్పెక్టర్ టి. సుబ్బరామయ్య, స్పోర్ట్ ఆర్గనైజర్ సి. హెచ్. సిద్ధాంతిగారలు కూడా పాల్గొన్నారు.

సంజా నారాయణప్పగారు మాట్లాడుతూ నూతన రాష్ట్రానికి సుశిక్షితులైన యువకులను తయారుచేయు బాధ్యత వ్యాయామ ఉపాధ్యాయులమీద ఉన్నదన్నారు. కార్యదర్శి కె. బసవయ్యగారు నివేదికను చదివారు. టి. సుబ్బరామయ్యగారు వ్యాయామోపాధ్యాయ సంఘ ఆవశ్యకతను వివరించారు.

1955 జనవరిలో ఉరవకొండలో సంఘ ప్రథమ మహాసభను జరప నిర్ణయించారు.

సంజా నారాయణప్ప (అధ్యక్షులు) జి. నారాయణరెడ్డి, బి. అంజనేయులు (ఉపాధ్యక్షులు), కె. బసవయ్య (కార్యదర్శి), కె. పద్మనాభయ్య (కోశాధికారి), ఎస్. రాజగోపాల్, పి. హెచ్. సిద్ధాంతిగారలతో ఒక రాయబారవర్గాన్ని ప్రభుత్వంవద్దకు పంపుటకు అంగీకరించారు.

## తిరుమల గరుడోత్సవం

తిరుపతి, అక్టోబరు 4: గత రాత్రి జరిగిన శ్రీవేంకటేశ్వరస్వామివారి గరుడోత్సవం దర్శించి తరించటానికి లక్షమందికిపైగా భక్తులు దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చారు.

దేవస్థానం నిర్వహణోద్యోగి శ్రీ సి. అన్నారావు, తిరుమల పేష్కార్ శ్రీ టి. దేవరాజ్ గారలు ఉత్సవ నిర్వహణకుగాను నియమించబడిన ప్రత్యేక సిబ్బందితో అమిత ప్రయాసపడి సక్రమమైన యేర్పాట్లు చేయుచున్నారు. దినదినం అధిక సంఖ్యలలో వస్తున్న యాత్రికులకు వసతి సౌకర్యాలు కల్పించబడుతున్నాయి, మతోపన్యాసాలు, భజనలు, హరికథా కాలక్షేపాలు కొరత లేకుండా ఏర్పాటు చేయబడినాయి. రాత్రి గరుడోత్సవంలో మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తిగా పనిచేసిన శ్రీ బి. సోమయ్యగారు, శ్రీయుతులు ఆలపాటి వెంకట్రామయ్య, జి వెంకటశెట్టి, జి. వెంకటరెడ్డి దేవాదాయాల పూర్వంమంత్రి కె. వెంకటస్వామినాయుడు గారలు మొదలయిన ప్రముఖులు పాల్గొన్నారు.

ఈనెల 6 వ తేదీన రథోత్సవం జరుగుతుంది. రజతరథయాత్ర రేపిడు ఉండదని తెలుస్తున్నది. (స్వ. వి.)

## స్వామి సీతారాం అస్వస్థత

వినయాశ్రమం, అక్టోబరు 1: ఫజల్ అలీ గారిని కలుసుకోవలసినదిగా శ్రీస్వామి సీతారాంగారికి ఆహ్వానం అందినది. కాని అనారోగ్య కారణమున వారు కర్నూలు వెళ్లలేకపోయారని వినయాశ్రమం ప్రచురణకర్త శ్రీ కొల్లపూడి వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు తెలుపుతున్నారు.

స్వామి సీతారాంగారు, తమ కార్యదర్శియైన శ్రీ నేతి వెంకట దలపతిరావుగారి ద్వారా, తమ భావములను ఫజల్ అలీ కమీషనుకు పంపియున్నారు.

# ప్రెస్ కమిషన్ సిఫార్సులపై చర్చ

## పత్రికా సంపాదకుల స్థాయీసంఘ సమావేశం

న్యూఢిల్లీ, అక్టోబరు 4: అఖిల భారత పత్రికా సంపాదకుల మహాసభ స్థాయీసంఘ సమావేశం న్యూఢిల్లీలో, కానిస్టిట్యూషన్ క్లబ్‌లో యీ నెల 14 వ జరుగుతుంది.

# రేపల్లె తాలూకాలో అభివృద్ధి పనులు

## జాబితా తయారుకు కాంగ్రెస్‌సంఘం నిర్ణయం

రేపల్లె, అక్టోబరు 4: ఈ తాలూకా కాంగ్రెసుసంఘ సర్వసభ్య సమావేశం గత 29 తేదీన శ్రీ ఉన్నవ చింపయ్యగారి అధ్యక్షతన జరిగింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్పించవలసిన యీ తాలూకాలోని రోడ్లు, పంటనీటి వసతులు, మురుగుపారుదల సౌకర్యం విద్యుచ్ఛక్తి మొదలైన అభివృద్ధి కార్యక్రమాలను గురించి, యింతవరకూ అందిన సూచనల ప్రకారం ఒక సమగ్ర నివేదిక తయారుచేసి ప్రభుత్వమునకు సమర్పించవలసిందిగా తాలూకా కాంగ్రెసు అధ్యక్షునికి ఆదేశమిస్తూ సభవారు తీర్మానించారు.

తాలూకాలోని బంజరుభూములను భూమిలేని నిరుపేదలకు సక్రమంగా పంపిణీజరిగేట్లు చూచుటకుగాను, వాస్తవిక పరిస్థితులను ప్రభుత్వదృష్టికి తెచ్చుటకు ఒక కమిటీని నియమించవలసిందిగా తాలూకా కాంగ్రెసు కార్యవర్గాన్ని ఆదేశిస్తూ తీర్మానించారు.

ఖాజీపేట రైలుప్రమాదంలో మరణించినవారి కుటుంబాలకు సానుభూతి తెలుపుతూ తీర్మానించారు. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారి మృతికి చింతిస్తూ వారి కుటుంబానికి సానుభూతి తెలుపుతూ తీర్మానించారు.

# వ్యవసాయ రుణాల వాయిదాల చెల్లింపు

## రాజోలు కాంగ్రెసు విజ్ఞప్తి

రాజోలు, సెప్టెంబరు 30: రాజోలు తాలూకాలోని రైతుల ప్రస్తుత ఆర్థిక దుస్థితి కారణంగా, ప్రభుత్వం ఇచ్చిన వ్యవసాయ ఋణాలను 1955 ఫిబ్రవరి నాటనుండియే వాయిదాలుగా వసూళ్లు చేయమని రాజోలు తాలూకా కాంగ్రెసుసంఘం ప్రభుత్వాన్ని అర్థించింది.

రాజోలు తాలూకా కాంగ్రెసు సంఘ సర్వసభ్య సమావేశం ఈరోజున సైనాల గణేశ్వరరావు గారి అధ్యక్షతన కార్యాలయంలో జరిగింది.

గాంధీజయంతి సందర్భంలో తాలూకాలోని కేంద్రస్థలాలలో నిర్మాణ కార్యక్రమాల ప్రచారం చేయటానికి నిర్ణయించారు. ఖాజీపేట ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో మరణించినవారి కుటుంబాలకు, గాయపడ్డవారికి సానుభూతిని తెలియజేశారు. ఇటువంటి సంఘటనలు ముందు జరగకుండా, తగిన శ్రద్ధను రైల్వేశాఖ తీసుకోవాలనికోరారు.

## కార్యవర్గ సమావేశం

రాజోలు, సెప్టెంబరు 25: రాజోలు తాలూకా కాంగ్రెసు కార్యవర్గం కార్యాలయంలో నేటి మధ్యాహ్నం 12 గంటలకు సైనాల గణేశ్వరరావు గారి అధ్యక్షతన సమావేశమైంది.

వివిధ వర్గాల బంజర్ల దరఖాస్తుదారుల సంఘానికి తగు ప్రాతినిధ్యం ఇచ్చి, దానికి సహకరించాలని ప్రభుత్వాన్ని, ఉద్యోగులనూ కోరారు. పాటలంకల వ్యవహారాలలో ప్రస్తుత కౌలు పరిస్థితిని మార్పు చేయరాదనీ, ఇకముందు ఆయా ప్రాంతాల లంకలను, ప్రాంతీయ సంఘాలకే సమంగా ఇవ్వాలనీ, వరిసాగులో ఉన్న వాటిని మినహాయించి, మిగతా లంకభూములను బంజరు పంపకవిధానంలో చేర్చమని ప్రభుత్వాన్ని కోరారు.

దివితాలూకా మోపిదేవిలో కాంగ్రెసు వాదులపై కమ్యూనిస్టుల దుష్ప్రవర్తనను తీవ్రంగా గర్హిస్తూ తీర్మానించారు. జిల్లాబోర్డుల ప్రసక్తి చర్చింపబడి నిర్ణయం జరగకుండా రాబోయే సర్వసభ్య సమావేశానికి విడిచిపెట్టబడింది.

# తణుకు స్త్రీసమాజానికి తిమ్మారెడ్డిగారి రాక

తణుకు, అక్టోబరు 1: స్థానిక స్వపరిపాలనాశాఖామంత్రి పి. తిమ్మారెడ్డి గారు జిల్లా పంచాయతీల మహాజనసభల ప్రారంభోత్సవ సందర్భంగా గతవారంలో ఇక్కడకు వచ్చినప్పుడు తణుకులోని 'ఆంధ్రపంచదార' ఫ్యాక్టరీని సందర్శించారు. మేనేజింగు డైరక్టరు ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్ గారు స్వాగతమిచ్చారు. అనంతరం తిమ్మారెడ్డిగారు, శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజమునకు వచ్చారు. సమాజ అధ్యక్షులు శ్రీమతి దీవులపల్లి సత్యవతమ్మగారు, సమాజ బాలికలు నృత్యసంగీతములతో స్వాగతమిచ్చారు. సమాజ కార్యదర్శిని శ్రీమతి చోప్పెల్ల మహాలక్ష్మమ్మగారు సన్మానపత్రం సమర్పిస్తూ, బాలసరస్వతీ సమాజమును ప్రభుత్వము, స్థానిక సంస్థలు ఆదరించవలసిన బాధ్యతయున్నదని విజ్ఞప్తిచేశారు. మంత్రి సన్మానపత్రమునకు సమాధానంచెప్పుతూ యీ సంస్థ బ్రహ్మాండమైన కార్యక్రమమును వహించుకొన్నదని విని చాల సంతసం పొందాననీ, స్థానిక సంస్థల సహాయానికి ప్రాముఖ్యముండునని చెప్పారు.

డాక్టరు అయ్యగారి వీరేశ్వరశాస్త్రి గారి ఆశీర్వచనాలతో సభ ముగిసింది. రాత్రి మంత్రిగారి గౌరవార్థం శాసన సభ్యులు చిట్టూరి ఇంద్రయ్య గారు విందు చేశారు. (స్వ. వి.)

(ప్రెస్‌కమిషన్, సిఫార్సులు, పోటీ -పత్రికా రూపాలు, ప్రకటనలు మున్నగు అంశాలు చర్చిస్తారు.)

# సాధనమార్గాలు: సాధించే లక్ష్యాలు

## గాంధితత్వం: ఆల్డస్ హక్స్లీ ప్రసంగం

న్యూయార్కు, అక్టోబరు 4: గత శనివారంనాడు వాషింగ్టనులోని భారత రాయబారవర్గ కార్యాలయంలో గాంధిజయంతి ఉత్సవాలు జరిగాయి. సుప్రసిద్ధ రచయిత ఆల్డస్ హక్స్లీ గాంధి తత్వమునుగూర్చి వ్యాఖ్యానం చేశారు. లక్ష్యాలు సరియైనవిగా వుండడం ఎంత ముఖ్యమో సాధనోపాయాలు గూడా అంత ముఖ్యమైనవిగా వుండాలని గాంధిమహాత్ముడు పట్టుబట్టిన విషయానికి ఆయన ప్రాముఖ్యం యిచ్చారు.

ఐక్యరాజ్యసమితి జనరల్ అధ్యక్షురాలు శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఉపన్యసిస్తూ 'మానవులు యిప్పటికీ ఒండొరులతో పోరాడుతూనే వున్నారు. సోదరుడు సోదరుని చంపుతున్నాడు, గాంధిమహాత్ముని పరమలక్ష్యాన్ని యింకా మనం చేరుకోలేదు. గాంధి సిద్ధాంతాలు కొత్తవికావు. ఋషులకు, మహాత్ములకు ఈ సిద్ధాంతాలు తెలిసేవున్నవి. కాని విస్తరింపబడలేదు' అని హెచ్చరించింది.

ఇప్పుడు అమెరికాలోవున్న భారత పారిశ్రామికుడు శ్రీ జి. డి. బిర్లా, సాటర్‌డే పత్రికా సంపాదకుడు నార్మన్ కజిన్సు, వాషింగ్టన్‌లోని భారత రాయబారి శ్రీ జి. ఎల్. మెహతా గారలు గూడా సభలో ఉపన్యసించారు.

భారత ఆర్థికశాఖ మంత్రి శ్రీ దేశ్‌ముఖ్, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, భారతదేశములోని అమెరికన్ రాయబారి జార్జి ఎలెన్, ఆయన సతి, వాషింగ్టన్‌లోని న్యూజీలాండ్, నెదర్లాండ్సు, ఇండోనేసియా రాయబారులు ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు.

## హో చి మిన్ చిత్రం

హానోయ్, అక్టోబరు 5: వియత్నాం డెమాక్రాటిక్ రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ హోచిమిన్ తాను స్వంతంగా సంతకంచేసిన తనఫోటోను అంతర్జాతీయ అజ్మాయిషీ పర్యవేక్షణ సంఘం అధ్యక్షుడు శ్రీ ఎ. జె. దేశాయ్‌కి బహూకరించారు.

మూడు వారాల క్రిందట డాక్టరు హో ను ఈ సంఘసభ్యులు కలుసుకున్నారు. అందులో ఒకరు ఈ సూచన చేశారు. డా॥ హో వెంటనే పటం కోసం ప్రయత్నించారు గాని అది దొరకలేదు. ఈ విషయం జరిగిన మూడువారాలకు ఇప్పుడు డా॥ హో ఆటో ఫోటోను పంపించారు.

## తపాలాబిళ్లలు సేకరించే వారిసభ

న్యూఢిల్లీ, అక్టోబరు 4: ఇండియా తపాలాబిళ్లల శత వార్షికోత్సవ సందర్భంలో నేడిక్కడ తపాలాబిళ్లలు సేకరించేవారి సభ జరిగింది. వివిధదేశాల ప్రతినిధులు పాల్గొన్న ఈ సభను కేంద్ర వార్తా సౌకర్యాలమంత్రి జగజీవన్‌రాం ప్రారంభించారు.

ఒక దేశపు తపాలాముద్రలు ఆ దేశానికి రాయబారుల వంటివనీ, ఇవి తమ తమ దేశాల సంస్కృతిని ప్రతిబింబిస్తూ కళాన్వితములై ఉండాలనీ ఆయన ఈ సందర్భంలో అన్నారు. ఇట్టిగోష్ఠి ఏర్పాటు చెయ్యడం, వాటిని సేకరించేవారికే కాక, తంతి తపాలా శాఖకు కూడా ఎంతో ఉపయోగకారి కాగలదనికూడా ఆయన అన్నారు.

తరువాత ఇండియా తంతి తపాలా శాఖ ఉన్నతాధికారులూ, వివిధదేశాల ప్రతినిధులూ ప్రసంగించారు.

# ఎగిరే పళ్లెములు

## నిజంగా ఉన్నవని జర్మన్ శాస్త్రజ్ఞుని వాదన

బొంబాయి, అక్టోబరు 4: ఎగిరే పళ్లెములు (ఫ్లయింగ్ సాసర్స్) అనే ఛేదరాలు నిజంగానే ఉన్నవనీ, ఆకాశంలో మనకు గోచరించే వాస్తవముదాయంలో ఇవి కనీసం నూటికి పదివరకూ ఉంటాయనీ జర్మన్ రాకెట్ విమాన శాస్త్రజ్ఞుడు హెర్మన్ ఒబెర్త్ ఇవాళ యిక్కడ ఒక సమావేశంలో నొక్కి చెప్పారు.

ఆ ఎగిరే పళ్లాలను నడిపే జీవులు మానవులను పోలినవై ఉన్నవనుకోడానికి కూడా అవకాశం ఉన్నదని ప్రొ॥ ఒబెర్త్ తన అభిప్రాయం వ్యక్తపరచారు ఆ జీవులకు ఆయన "యురానిడెన్" అని పేరు పెట్టారు.

మానవకోటి కొంతకాలానికి కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే ఈ జీవులు అవతరించి ఉంటాయనీ, మన ఊహకు అందని ఏ కారణాలవల్లనో మొదటినుండి ఈ జీవులకు మానవులతో సంపర్కం పట్ల అయిష్టత ఏర్పడి ఉండవచ్చునని ఆయన అన్నారు. కాని ఈ ఎగిరే పళ్లెములలో ఏ ఒక్కటి ఈ భూమిమీద కూలి పడకపోవడానికి కారణం బహుశా, వాటి చోదకులసామర్థ్యం కారణం కావచ్చునని ఆయన అన్నారు.

గత ప్రపంచయుద్ధం చివర రోజులలో జర్మనీవి-7 అనే ఒకరకం రాకెట్లు తయారుచేసింది. నాటి సమగ్ర స్వరూపమే ఈ ఎగిరే పళ్లెములు 1945 లో ఈ 'వి-7' రాకెట్లు రష్యాకి స్వాధీనమయ్యాయి. ఈనాటి ఈ ఎగిరే పళ్లెములే, ఆనాటి వి-7 రాకెట్ల సమగ్రస్వరూపాలు కావచ్చు అని ప్రొ॥ ఒబెర్త్ అన్నారు.

# పండ్ల పరిశ్రమ అభివృద్ధి

## మైసూరులో గోష్ఠి

మైసూరు, అక్టోబరు 4: పండ్లు, కూరగాయల పరిశ్రమ గూర్చిన ఒక గోష్ఠిని భారతప్రభుత్వ శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనశాఖా డైరెక్టరు శ్రీ యస్. యస్. భట్నాగర్ నేడిక్కడ ప్రారంభించారు.

శ్రీ భట్నాగర్ ప్రసంగిస్తూ శాస్త్రవేత్తలకు, పరిశ్రమపరుల్వ సహకారం ఉండాలనీ, ఆహారవిషయాలకు సంబంధించిన సంస్థలలో వ్యాపార శాఖలు కూడా వుంటే మంచిదనీ సూచించారు.

డబ్బాలలో జాగ్రత్తగా శాస్త్రీయపద్ధతిపై దాచిపుంచిన ఆహార పదార్థాలను, పండ్లను ప్రజలకు రుచి చూపించి అభిరుచి కలిగించాలని ధరలు ఆకర్షణీయంగావుండాలనీ, కోరారు. ఇందుకు సంబంధించిన శాసనాలు చేయవలసినదిగా ప్రభుత్వానికి సిఫార్సు చేయాలని విజ్ఞప్తిచేశారు.

ఈపరిశ్రమ అభివృద్ధి ద్వితీయప్రణాళికలో భాగంకావాలని కేంద్ర ఆహార విషయాల పరిశోధనాసంస్థ డైరెక్టరు ప్రతినిధులకు స్వాగతం చెప్తూ అన్నారు.

మధ్యాహ్నం గోష్ఠిలో చాలామంది తమ వ్యాసాలను చదివారు. అంతకుముందు శ్రీ భట్నాగర్ నూతన టెక్నాలజీ బ్లాక్‌కు శంకుస్థాపన చేశారు.

# వియత్నాంకు బ్రిటిష్ రాయబారి

లండన్, అక్టోబరు 5: వియత్నాంకు బ్రిటిష్ రాయబారిగా సర్ హ్యూబర్టు గేవ్స్ స్థానే హ్యూస్టీన్‌సన్ నియమితులైనట్లు నేడు ప్రకటింపబడింది. సర్ హ్యూబర్టు బ్రిటిష్ విదేశాంగశాఖనుంచి విరమిస్తున్నారు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ ఏకాదశి 1954 సం॥ అక్టోబరు 8 శుక్రవారం శు॥ ఏకాదశి 22-24 ధని రా 8-38 వర్జ్యం 8-11 ల 9-44 కు.

శు॥ ద్వాదశి అక్టోబరు 9 శనివారం శ॥ ద్వాదశి 20-18 శత రా 2-4 వర్జ్యం 10-20 ల 11-50 కు.

ఆంధ్రపత్రిక

[illegible]

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ ఏకాదశి శుక్రవారం

## ట్రీస్టీ పరిష్కారం

పశ్చిమరాజ్యాల ఐకమత్యాన్ని భగ్నంచేయగల మూడు సమస్యలు క్రిందటి వారం రోజులలో అన్నిపక్షాలకు తృప్తికరంగా పరిష్కారమైనవి. పశ్చిమయూరపురక్షణ, పశ్చిమ జర్మనీ భవిష్యత్తు, ట్రీస్టీ సమస్యలు అయిదారు సంవత్సరాలుగా పశ్చిమ రాజ్యాలను కలవరపెట్టుతున్నవి. ముఖ్యంగా ట్రీస్టీ సమస్యను సోవియట్ రష్యా ఇటలీని పశ్చిమరాజ్యాల కూటమిలో చేరకుండా చేయడానికీ, యుగస్లావియా పశ్చిమ రాజ్యాలకు సన్నిహితం కాకుండ చేయడానికి వినియోగించుకున్నది. మార్షల్ టిటో మాస్కోతో తెగతెంపులు చేసుకున్న తర్వాత పశ్చిమ రాజ్యాల బాధ్యత హెచ్చింది. ఇటలీకి, యుగస్లావియాకు సమ్మతంగావుండగల పరిష్కారాన్ని సాధించవలసివచ్చినది. ఇటలీ కమ్యూనిస్టులు ట్రీస్టీ విషయంలో యుగస్లావియాకు అనుకూలంగానే వ్యవహరిస్తూ వచ్చి నప్పటికీ, పశ్చిమరాజ్యాలు ఇటలీలో కమ్యూనిస్టులకు బలం చేకూరకుండా చేయడానికి ఇటలీ కోర్కెలనే బలపరుస్తూ వుండవలసివచ్చింది. యుగస్లావియా సోవియట్ ఉపగ్రహ రాజ్యంగా వుంటున్నంతకాలం పశ్చిమరాజ్యాలు ఇటలీ వాదాన్ని బలపర్చడానికి ఇబ్బంది లేకుండా పోయింది.

ఈ వారం పశ్చిమ రాజ్యాలు ట్రీస్టీని ఇటలీ యుగస్లావియాలమధ్య విభాగించి ఒక వికృతి పరిస్థితినుంచి బయటపడినవి. ట్రీస్టీ విభజనకంటే సరియైన పరిష్కారం మరొకటి లేనందున ఇటలీ, యుగస్లావియాలు రెండున్నూ ఈ విభజనను సమ్మతించినవి. ఇంతవరకు బ్రిటన్, అమెరికా సేనల ఆక్రమణ క్రిందనున్న ప్రాంతం ఇటలీ వశమైంది. ప్రస్తుతం యుగస్లావియా ఆక్రమణ క్రిందనున్న ప్రాంతం యుగస్లావియాకు సంక్రమించినది. ఇందువల్ల ఇటలీ, యుగస్లావియా ప్రాంతాల సరిహద్దుల నిర్ధారణ విషయంలో తిరిగి విభేదాలు ఏర్పడే ప్రమాదం నివార్యమైంది.

ఒకప్పుడు యుగస్లావియా ట్రీయస్టీరేవు వరకూ సేనలను నడిపించడానికి సిద్ధమైనది. ఈ సైనికచర్యలను ప్రతిఘటించడానికి ఇటలీ సైనిక సన్నాహాలు చేసుకోవడం కూడా జరిగింది. సార్, సైలెలాండ్‌లు (ఫ్రాన్సు-జర్మనీల సఖ్యత, సహకారాలకు ఎలా ప్రతిబంధకమౌతూ వచ్చినవో ఈ ట్రీస్టీకూడా ఇటలీ-యుగస్లావియాల సఖ్యతకు పెద్ద అవరోధంగా తయారైనది. ట్రీస్టీ విభజన ఈ అవరోధాన్ని తొలగించినదని ఆశింపవచ్చును.

ద్వితీయ ప్రపంచసంగ్రామం సాగుతూ వున్నప్పుడు ఇలాంటి అనేక విషయాల్లో మిత్రరాజ్యాలు దూరదృష్టితో వ్యవహరించలేకపోయిన కారణంగా, యుద్ధానంతరం ప్రతిదీ ఒక సమస్యగా తయారైనది. వివిధ ప్రాంతాలకు సంబంధించిన సమస్యలు ఆ ప్రాంతాలను ఆక్రమించుకొనివున్న వారిమధ్య సంపకం జరిగితేగాని పరిష్కారం కావడంలేదు. అట్టి విభజనకూడా సర్వసమస్యా పరిష్కారమార్గం కాదని కోరియా ఇప్పటికీ హెచ్చరించుతూనే వున్నది.

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో యూదులకు బ్రిటిష్ ప్రభుత్వం చేసిన వాగ్దానం ఫలితంగా పాలస్తీనా విభజన అవసరమైంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో మిత్రరాజ్యాల ఐకమత్యాన్ని కాపాడుకోవడానికి అనుసరించిన విధానాల ఫలితంగా జర్మనీ, కోరియాలు రెండుగా విభాగమైనవి. అదే విధంగా ఇప్పుడు ట్రీస్టీని రెండు చేయడం జరిగింది. ట్రీస్టీ విభజన ఒడంబడికని ప్రధానాంశాలు నిరాక్షేపణీయంగానే వున్నవి. ఇటలీ యుగస్లావియా ప్రజల సఖ్యత సామరస్యాలను పెంపొందింపవచ్చును. రెండు దేశాల ప్రజలసంస్కృతి, విజ్ఞానముల సంరక్షణకు ఒడంబడికలో తగిన నిబంధనలు వున్నవి. ఒడంబడిక జరిగిన ధోరణిలోనే ఒడంబడిక అమలుకూడా జరిగితే ఈ సమస్య శాశ్వతంగా పరిష్కారమైనదనే ఆశింపవచ్చును.

అయితే ట్రీస్టీరేవు విషయంలో జరిగిన ఏర్పాట్లు డాన్జిగ్‌రేవు చరిత్రను జ్ఞాపకం చేస్తున్నవి. ఈ రేవు ఇటలీ వరంగానే వుంటుంది. ట్రీస్టీరేవు పరిపాలన 1947 శాంతి ఒడంబడిక ననుసరించి జరుగుతుందని ఇప్పటి ఒడంబడిక సూచిస్తున్నది. ఆ ఒడంబడిక, ముఖ్యంగా ట్రీస్టీకి సంబంధించినంతవరకు ఇంతవరకూ అమలు జరుగలేదు. ఇపుడు జరిగిన ఒడంబడిక ఫలితంగా ఈ చిక్కులన్నీ తొలగిపోవచ్చును!

## భారతదేశ అభ్యున్నతి

### అటావా సభలో ప్రముఖుల ప్రశంస

అటావా, అక్టోబరు 6: ఇండియా ప్రభుత్వం ఆర్థిక పారిశ్రామిక రంగాల్లో సాగిస్తున్న అభివృద్ధి కార్యక్రమాలు ఇచ్చట జరుగుతున్న కొలంబో పథకం రాజ్యాల సమావేశంలో అందరి మన్ననలకు పాత్రం అయినాయి.

14 ఇతర రాజ్యాల ప్రతినిధుల తరఫున మాట్లాడుతూ ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి రిచ్చర్డ్ కేసీ ఈ మెప్పుదల ప్రకటించారు.

ఆర్థిక అభ్యుదయాన్ని ఆశించి ఇండియా వివిధ సమస్యలను ఎదుర్కొనడంలో ప్రదర్శిస్తున్న ధైర్యం, ఊహాపోహాలు, నైపుణ్యం బ్రహ్మాండమైనవిగా వున్నాయి. వాటిని గౌరవించక అందరికీ తప్పడంలేదు. పురాతనమైన ఆర్థిక వ్యవస్థను ఆధునాతనమైన పద్ధతులను పట్టించడంలో ఇండియా చూపిస్తున్న ప్రజ్ఞ నిరుపమానంగా వుంది అన్నారు.

### జపాన్, థాయిలాండ్‌లకు ఆహ్వానం

సేకు కొలంబో పథకం రాజ్యాలు జపాన్, థాయిలాండుల ఈ సంధిలో చేరవలసిందని ఆహ్వానించారు. దీని కొఱకు 14 రాజ్యాల ప్రతినిధులు రహస్యంగా సమావేశమై జపానుకు నేడే ఇట్టి ఆహ్వానాన్ని పంపించారు. ముందు ఇండొనేషియా అభ్యంతరం చెప్పిందిగాని తర్వాత ఆ అభ్యంతరాలను ఉపసంహరించుకుంది. థాయ్‌లాండ్‌ను అంతా ఏకగ్రీవంగా ఆహ్వానించారు.

## అదీ .... ఇదీ .... అన్నీ....

ఇరవైరోజుల్లో ఆంధ్ర అసెంబ్లీ సమావేశమౌతుంది. మంత్రివర్గంలో విశ్వాసం లేదని అసెంబ్లీ ప్రకటించాలని కమ్యూనిస్టుపార్టీవారు, కృషికార్ లోక్ పార్టీవారు కోరుతున్నారు. విశాఖపట్నం సమావేశంలో స్పీకర్‌లో విశ్వాసం లేదనే తీర్మానాన్ని కమ్యూనిస్టులు ప్రతిపాదించాలనుకున్నారు. ఆ తీర్మానానికి ఇతర పార్టీలవారెవ్వరూ అంత అనుకూలంగా లేనందువల్ల ఎవరికీ కష్టం లేకుండా ఆ వ్యవహారం పరిష్కారమైపోయింది.

ఈసారి మంత్రివర్గంలో విశ్వాసం లేదనే తీర్మానాన్ని కమ్యూనిస్టుపార్టీ కృషికార్ లోక్ పార్టీ విడివిడిగా ప్రతిపాదింప దలచినా తీర్మానం వోటుకు వచ్చేటప్పటికి రాజధాని తీర్మానం విషయంలో మాదిరిగా గాక, రెండు పార్టీలవారు కలసి వోటు చేయవచ్చును తీర్మానం నెగ్గుతుందా లేదా అంటే ఇప్పుడు ఎవరూ చెప్పలేరు. ప్రభుత్వ పక్షంవారు మాత్రం తీర్మానం నెగ్గదని ఘంటాపథంగా చెప్తున్నారు. తీర్మానం నెగ్గుతుందని "అశ్వత్థామ హతః కుంజరః" అన్నట్లయినా ఎవ్వరూ అనడం లేదు. అవిశ్వాస తీర్మానాలను ప్రతిపక్షం వారు ప్రతిపాదించడం వారి గురుతర బాధ్యతను నిర్వర్తించడానికే అలాగే ప్రభుత్వపక్షం ఆతీర్మానాలను ప్రతిఘటిస్తుంది.

ఆత్మహత్యా ప్రయత్నం శిక్షింపదగిన నేరం. కనుక ప్రభుత్వపక్షంవారెవ్వరూ ప్రభుత్వంలో విశ్వాసం లేదనే తీర్మానాన్ని, తెలియకుండానే అయినా బలపరచరు. ప్రజాప్రతినిధుల విశ్వాసం సంగతి ఏమైనా ప్రజల విశ్వాసాన్ని పొందడానికి మాత్రం మంత్రివర్గం అనేక పనులు చేస్తున్నది. రాష్ట్రావతరణ దినోత్సవం నాడు ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు "పదిరూపాయల భూమి శిస్తు చెల్లించే రైతులు ఇకనుంచీ శిస్తు చెల్లించనక్కర్లేదు." అని ప్రకటించారు. రాష్ట్ర జనాభాలో దాదాపు సగంమందికి ఈ శిస్తు మినహాయింపు వర్తిస్తుందట!

* * *

రైతులు పొందే లాభం మాట అటుంచినా, రాష్ట్ర మంత్రివర్గం ఈ నిర్ణయంతో ప్రత్యాగ్రహపక్షాల నడుములు విరగ్గొట్టిందని చెప్పవచ్చును. శిస్తు ఎగవేసే వుద్యమాన్ని ప్రారంభించడానికి ఆస్కారం లేకుండా పోయింది. ఇందువల్ల, పది రూపాయలకు పైబడి భూమిశిస్తు చెల్లించే వారంతా ఆస్తిప్రియులు కనుక వారు ఇలాంటి 'ఎగవేత' ఉద్యమాల జోలికి రారు. ప్రతిపక్షాల అస్త్రాల్లో ఒక అస్త్రం పోయింది!

ఈ నిర్ణయంలో ఇంతశక్తి వున్నది కనుక ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారిరు "ఇలాంటి నిర్ణయాన్ని వెల్లడించగలవారు ఒక్క ప్రకాశం పంతులుగారే" అన్నారు. ఈ నెలాఖరున ఆంధ్ర అసెంబ్లీ సమావేశంలో ప్రజాప్రతినిధులు మంత్రివర్గంలో విశ్వాసం పోయిందని ఉద్ఘాటిస్తూ వుంటే అసెంబ్లీ బయట ప్రజలు మంత్రివర్గంలో విశ్వాసం ఏర్పడిందని నినాదాలు చేయగలరు. అప్పుడు ప్రజాప్రతినిధులకు మంత్రివర్గంలో విశ్వాసంవుందో లేదో అన్న సంగతి అడుగున పడిపోయి, ప్రజలకు ప్రజాప్రతినిధులలో విశ్వాసం పోతోంది, పోయింది అన్న విషయం పైకి వస్తుంది.

* * *

ప్రజా విశ్వాసాన్ని కోల్పోయిన ప్రజాప్రతినిధుల విశ్వాసా విశ్వాసాలను గురించి ఆంధ్ర మంత్రివర్గం అంతగా ప్రజా ప్రతినిధులు మాత్రం మహాచిక్కు సమస్యను ఎదుర్కొనవలసి వస్తుంది. ఆందోళనచెంద నవసరంలేదు.

కాగా ప్రజా ప్రతినిధులు మాత్రం మహాచిక్కు సమస్యను ఎదుర్కొనవలసినవారౌతున్నారు.

సర్ యస్. వి. రామమూర్తి కమిటీ నివేదికను అమలు జరిపి ఈ మద్యనిషేధ సమస్యను పరిష్కరించాలని ఆంధ్ర అసెంబ్లీ విశాఖపట్నం సమావేశంలో తీర్మానించింది. మంత్రివర్గం ఆ తీర్మానాన్ని అమలుజరపలేదు. అందుకు మంత్రివర్గాన్ని అభిశంసించడానికి కమ్యూనిస్టు, కృషికార్ పార్టీలు ఇప్పుడీ అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించినవి. తమ తీర్మానాన్ని మంత్రివర్గం అమలు జరపకపోయినప్పుడు అసెంబ్లీ సభ్యులు ఏం చేయాలి? చూస్తూ వూరుకోవడమేనా? తీర్మానాన్ని అమలుజరపని మంత్రివర్గంలో విశ్వాసం ప్రకటిస్తే, మరి విశాఖపట్నంలో ఆతీర్మానం ఎందుకు చేసినట్లు? అమలు జరపమని ప్రభుత్వాన్ని అప్పట్లో ఆదేశించిన ఆంధ్ర అసెంబ్లీ ఇప్పుడు ఏమి చేసేటట్లు?

అయితే ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు ఇంతకంటే చిక్కు సమస్యలను అతి సులభంగా పరిష్కరించివేసిరి. ఈ సమస్యలు కూడా ఆంధ్ర అసెంబ్లీ సభ్యులముందు అతి సునాయాసంగా పరిష్కారం కావచ్చు.

ఇంతకూ ప్రజాసోషలిస్టు పార్టీ వారు ఏం చేస్తారో ఎవరికీ తెలియదు. పార్టీ అధ్యక్షుడు కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు విషయాన్ని ఢిల్లీలో చర్చిస్తామన్నారు. విజయనగరం రాజాగారు ఎవరితో చర్చిస్తారో తెలియదు. చివరికి ఏం చేస్తారో?

ఇక విశ్వనాథంగారి అనుయాయులకు వారిలో మాత్రమే విశ్వాసం వుందో లేక వారి మంత్రివర్గంలో కూడా విశ్వాసం వుందో ఇంకా ధృవపడలేదు. అందుకే విశ్వాసరాహిత్య తీర్మానం ఉపయోగపడవచ్చును.

## జానపద సంగీతపునరుద్ధరణ: రేడియో కేంద్రాల కృషి

భారతదేశంలో ఆదిమవాసుల సంగీతం, జానపద సంగీతం పునరుద్ధరించడంలో ఆలిండియా రేడియో చెప్పదగిన పాత్ర నిర్వహించింది.

ఆలిండియా రేడియోనుంచి క్రమంగా, ఈ రెండురకాల కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి. ఇటువంటి సంగీతాన్ని రికార్డుచేయటానికి నిపుణుల్ని పంపే కృషి జరుగుతోంది. వీరు ఇది రికార్డుచేయడానికి చేతితో పట్టుకు వెళ్ళదగిన చిన్న చిన్న యంత్రాలు ఉన్నాయి. ఈ రికార్డుచేయడం ప్లేట్ల మీద చెయ్యరు. "టేపు" మీదచేస్తారు. ఈ పద్ధతిలో చాలసౌకర్యంవుంది.

కళాపునరుద్ధరణకోసం జరిగిన జాతీయోద్యమంలో...ఇది రాజకీయ ఉద్యమపు ప్రతిబింబంగా చెప్పాలి... అదిలో కేవలం తన రాజసపూరితమయిన వారసత్వాన్ని మాత్రమే యీజాతి సంస్కరించింది. వంగదేశపు 'రివైవలిస్ట్' చిత్రకారుల పై చిత్రి అనేకస్మృతుల మేలవింపు, అజంతా విశిష్టత, మొగలు చిత్రాలలో ప్రతిబింబించిన మొగలాయి దర్బారు ఆటోపం, ఆడంబరం రసపుత్ర, పహాడీ చిత్రకారుల సున్నితమైన, పటిష్టమైన వర్ణచిత్రాలు దొడ్డతనం— ఇదంతా ఆ మేళవింపులో ఉంది. జెమినీరాయ్‌తో కొత్తశకం ఆరంభమైంది. ప్రజాస్వామ్య వారసత్వానికి కూడా అంజలిఘటించడం ప్రారంభమైంది. పాతకాలపు చిత్రాలలోవున్న రేఖకు, రంగుకు ఆయన ఇచ్చిన వ్యాఖ్యానం రీత్యా, వాటిలో ఒక నిరాడంబరత్వం, ఒకానొక పటిమ ఉన్నట్లు ఈనాడు గుర్తించారు. ఎంతో కాలంగా పాతకాలపు భావాలలో మునిగిన ధోరణికి ఒక సహజమైన ప్రతిచర్యగా యూరపులో అగ్రగణ్యులైన అనేక కళావేత్తలకి ఆ యీ చిత్రాలు నేడు ఆదర్శప్రాయమయాయి.

చిత్రకళలో వలెనే సంగీతంలో కూడా ఇదేస్థితి. జానపద సంగీతంలోను ఆదిమవాసుల సంగీతంలోనూ కూడా 'రసము' అన్నది కొత్తదికాదు; సాధకొరు లయిన ఏకొద్దిమందో మాత్రమే అనుభవించగలిగిన అపురూప విషయం కాదు. జానపద జీవితంలో సంగీతం ఒక సహజవిషయం. జీవితగమనానికి అది చుక్కానివంటిది. అగమనంతో (శ్రుతికలిపే టటువంటి ఉయ్యాలలో పసిపాపకి అది జోలపాట; శోకానికి చెలియలికట్ట. నిత్యజీవితానికి ఇది మేలవింపు. పొలాలలో పాటకజనం, పడవల మీద పడవవాళ్లు—అందరికీ కూడా పదాలు, పాటలు ప్రత్యేకంగావున్నాయి. వారి వారి కార్యకలాపాల్లో ఇది చేదోడు, వాదోడుగా ఉంటాయి.

జానపద సంగీత సాంప్రదాయంలో ఒక విశిష్టలక్షణం ఏమిటంటే గాయకుడు స్వజనాత్మకంగా కృషిచేయడానికి ఉన్న అవకాశం జానపదగీతాలలో తొలినాటిస్వరూపం అలానే ఉండవ మన్నది అరుదైన విషయం. గాయకులు మార్పులుచేస్తూఉంటారు. కల్పన చేస్తూఉంటారు. అందువల్లనే గామస్తులలో [illegible] ఒక్కొక్క రకపు గీతానికి భిన్న భిన్నమైన రీతులు.

ఈ జానపదగీతాల పుట్టుకలో పురాణాలను సృష్టించిన మానవజాతి మొదటి ప్రయత్నాలుకూడా మనం చూడవచ్చు. ఉదాహరణకు, పెళ్లిపాటలలోనూ, పంటపాటల్లోనూ కూడా 'సృష్టి', 'పుట్టుక' అన్నభావాలు మళ్ళీ మళ్ళీ గోచరిస్తూ ఉంటాయి. ఓరాన్ ఆదిమజాతుల సార్హుల్ ఉత్సవ గీతాల్లో ప్రధానవిషయం సూర్యదేవునికి, భూదేవికి వివాహం. ఈ ఉత్సవలక్ష్యం పొలాలలో ఫలసారం వృద్ధిచేయడం, అనేకజాతుల పురాణోక్తులలో ఇమిడి ఉన్న బీజసూత్రం యీ భావాలలో లీనమైయుంది.

రేడియోద్వారా ప్రజలకు మనసంగీతంలో ఉన్న జానపద సాంప్రదాయం సన్నిహితమైంది. మొదటిసారిగా యీ సంవత్సరం 'రిపబ్లిక్' దినోత్సవం సందర్భంలో ఒక ప్రత్యేక కార్యక్రమంలో జానపద సంగీతం ప్రసారం అయింది. ఏడురాష్ట్రాల సంగీతం ఇందులో ప్రసారం అయింది. అజ్మీర్, అస్సాం, బొంబాయి, మధ్యప్రదేశ్, మణిపూర్, పెప్సూ, సౌరాష్ట్రం. స్వాతంత్ర్య దినోత్సవంనుండు బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు జానపద సంగీతాన్ని రాజధాని నగరంలో రాష్ట్రపతి భవనం నుంచి 'రిలే' చేశారు. ఈనెల 18వ తేదీన ఆలిండియా రేడియో అఖిల భారత జాతీయ కార్యక్రమంలో వంగదేశపు జానపద సంగీతం వినిపించింది. ఆలిండియా రేడియో కేంద్రాలన్నీ కూడా ఆయా ప్రాంతాల జానపద సంగీతాన్ని ప్రసారం చేస్తూనే ఉన్నాయి.

## చైనా నడిగడ్డపై చాంగ్ కైషెక్ నౌకా విమానదాడుల విరమణ

### —అమెరికన్ వత్తిడి ఫలితం

తైపే, అక్టోబరు 6: అమెరికా వత్తిడిమూలంగా చైనా నడిగడ్డపైకి చాంగ్ కైషెక్ నౌకా, విమానబలాలు దాడిచెయ్యడం నిలిపివేయబడినదని ఇక్కడి విశ్వసనీయ వర్గాలవారు ఇవాళ చెప్పారు.

ఇటుపై నడిగడ్డ స్థావరాలపైకి దాడి చేయవద్దనీ, ఫ్యూకీన్, చికియాంతీరాల ప్రాంతంలోని తుపాకీపడవలూ, మోటారుపడవలూ మొదలైన వాటిపై మాత్రం కాల్పులు చేయవలసిందని జాతీయచైనా అధికారులు ఇవాళ ఉత్తరువులు ఇచ్చారట. ఫార్మోజాకు అమెరికన్ సైనిక సలహాదారుడు మేజర్ జనరల్ విలియం ఛేజ్ ఇచ్చిన సలహాప్రకారం పై ఉత్తరువు జారీ అయినవట. తినసలహాపాటించి, చైనా నడిగడ్డపై దాడినిలిపివేస్తే, ఇటుపై జాతీయచైనా అధీనంలోని ద్వీపాల పైకి నవచైనా దాడిచేసినప్పుడు అమెరికా సప్తమ నౌకాదళం సప్లయి, రవాణా మొదలైన వ్యవహారాలలో సహాయం చేస్తుందని మేజర్ జనరల్ విలియం ఛేజ్ చెప్పాడట.

జాతీయచైనా సేనాధిపతులు చాలామంది యీ "మడిగట్టుకునే" పలహా పాటించడానికి ప్రాతికూల్యత వ్యక్తపరచారట. కొన్ని ప్రాంతాలపై దాడి చేస్తూనే మరికొన్నిటిని ముట్టుకోకుండా ఉండడమేమిటని వారుఅభిప్రాయపడ్డారు. లోగడ కోరియా యుద్ధంలో "యాలూ" నదీ ప్రాంతాలవిషయంలో అమెరికా యీ "మడిగట్టుకునే" పద్ధతి అవలంబించింది.

మొత్తానికి నడిగడ్డపైదాడి నిషేధించబడినా క్వెమోయ్‌వద్ద పోరాటం జరుగుతూనే ఉంది.

### కమ్యూనిస్టు విమానదాడి

తైపే, అక్టోబరు 6: జాతీయ చైనాకు చెందిన టాచెన్ దీవిలోని బలిష్ఠ స్థావరాలపై తొలిసారిగా కమ్యూనిస్టు చైనా జెట్ విమానాలు విహారం చేసినవి, జాతీయచైనా రక్షణశాఖ ఇవాళ ప్రకటించింది.

ఆ విమానాలు రష్యాలో నిర్మించబడిన ఎం. ఐ. జి. 15 రకం జెట్ విమానాలనీ, అవి కోరియా యుద్ధంలో విరివిగా వాడబడినవనీ ఈ ప్రకటన తెలియచేసింది.

ఆ జెట్ విమానాలు వచ్చి వెళ్లిపోగానే, ఫార్మోజా సింధుశాఖలో గస్తీ తిరగడానికి మరికొన్ని జాతీయచైనా విమానాలు పంపబడినవని రక్షణశాఖోద్యోగి వాంగ్-ఇంటంగ్ చెప్పారు.

ఇటు తాచెన్ దీవులపైకీ, అటు 300 మైళ్ళదూరంలో ఉన్న జాతీయచైనా బలిష్ఠస్థావరం క్వెమాయపైకీ కూడా ఒకేసారి దాడి చెయ్యడానికి కమ్యూనిస్టుచైనా సన్నాహాలు చేస్తున్నదని జాతీయచైనా రహస్యదళాలు గతివారం తెచ్చిన వార్తలు సూచించాయి.

## ట్రిబ్యూనల్ నిర్ణయంపై బ్యాంకుల అప్పీలు

### సుప్రీంకోర్టు అనుమతి

న్యూఢిల్లీ, అక్టోబరు 4: బ్యాంకి ఉద్యోగులకు బోనసుఇచ్చే విషయమై లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్ నిర్ణయంపై అప్పీలు చేసుకోవడానికి 16 ఎక్స్చేంజి బ్యాంకులకు ప్రత్యేక అనుమతిని సుప్రీంకోర్టు ప్రసాదించింది.

బ్యాంకి అవార్డుపై రాజ్యాంగ విధాన వివరాలు ప్రకటించబడిన పిదప అప్పీళ్లు వినాలని సుప్రీంకోర్టు నిర్ణయించింది.

లాయిడ్స్ బ్యాంకి, గ్రైండ్‌లేస్ బ్యాంకి, సెంట్రల్ బ్యాంకి ఆఫ్ ఇండియా, ఇంపీరియల్ బ్యాంకి ఆఫ్ ఇండియా, పంజాబ్ నేషనల్ బ్యాంకి, చార్టర్డ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆస్ట్రేలియా, అండ్ చైనాలు మున్నగునవి పిటీషనర్లుగా వున్నవి.

## కాశ్మీర్ సమస్య మండలి చర్చకు రాదా?

### ఐక్యరాజ్యసమితివర్గాల సందేహం

యునైటెడ్ నేషన్స్, అక్టోబరు 6: కాశ్మీర్ సమస్యను భద్రతాసంఘం ఎదుట పెట్టడంకన్నా, తనకు గత్యంతరం లేదని పాకిస్తాన్ ప్రధానమంత్రి మహమ్మదాలీ ఇండియా ప్రధాని పండిత నెహ్రూకు అయితే వ్రాశాడుగానీ, అజెండాన్ని ఈ సంఘం ముందుకు తీసుకురావడానికి పాకిస్తాన్ ఎంతవరకు సిద్ధపడుతున్నదన్నదే సమితి వర్గాలకు అనుమానంగావుంది.

ఇందుకు ముఖ్యకారణం: పాకిస్తాన్ అమెరికా దగ్గరనుంచి ఆయుధాలు పుచ్చుకొంటోంది. అమెరికా ప్రోద్బలంతో టర్కీతో సైనిక ఒప్పందం చేసుకుంది. అమెరికావారి మనీలా సంధిలో చేరుతున్నది. అన్నింటికంటే అమెరికా సమష్టిరక్షణ ప్రయత్నాలన్నింటిలోను భాగస్వామిగా పనిచేస్తోంది. ఈఅన్నింటివల్ల దీనిస్వరూపం మారిపోయింది.

పూర్వమైతే పాకిస్తాన్ ఈ కాశ్మీరు వ్యవహారంలో తానేదో దెబ్బతిన్నట్లు తాను ఈసంఘం అన్నితీర్మానాలను పాలించడానికి అంగీకరించినా, ఇండియాయే అంగీకరించకుండా తిన్న అవస్థ పెడుతున్నట్లు, ముఖ్యంగా 1948 ఆగస్టు 13 తీర్మానాన్ని, 1949 జనవరి 5 తీర్మానాన్ని అమలుజరపక ఇండియా ఈ భద్రతాసంఘాన్ని కూడ ధిక్కరిస్తున్నట్లు నాటకం ఆడుతూ వచ్చింది. ఇండియా ప్రతినిధులు ఎంత నోరుచించుకొని, ఈసంఘం ఈమార్గం తప్పుదారుల్లో పడింది. పాకిస్తాన్ దురాక్రమణసంగతి ఏమిటంటారు. అని అడిగినప్పుడల్లా, ఈసంఘంలో పెద్దలు ఆ సంగతిని పట్టించుకోలేదు సరిగదా, సమితి కాశ్మీర్ కమిషన్ తీర్మానాల వల్ల ఆ సంగతి అప్రసక్తం అయిపోయిందని పాకిస్తాన్ మొరాయించగా ఆ మొరాయింపును ఆమోదించడమేగాక సానుభూతికూడా చూపుతూవచ్చారు.

ఈ వ్యవహారాన్నంతా పాకిస్తాన్ సమితిలోను, అమెరికాలోను, ఇంకా ఇతర దేశాల్లోను ఇండియాకు వ్యతిరేకంగా ప్రచారం చేయడానికి ఉపయోగించుకొనికూడా వుంది. కాశ్మీర్‌లో పాకిస్తాన్ దురాక్రమణను గురించి సరిగ్గా విచారించాలని ఇండియా కోరడం ఇష్టంలేని ఈ అన్ని రాజ్యాలలోను ఈ ప్రచారం బాగా పనిచేసింది.

అయితే ఇక ఇప్పుడు ఈ కాశ్మీర్ సుగూర్చి సమితిలో చర్చ ప్రారంభమైతే, అది పూర్వంలాగా వుండదు అని ఇచ్చట అంతా భావిస్తున్నారు. ఇది రెండు రాజ్యాలమధ్య వ్యవహారంగాక అంతర్జాతీయమైన వ్యవహారంగా ఇప్పుడు రూపాన్ని దాలుస్తుంది. సమితిలో అధికసంఖ్యాకమైన రాజ్యాలకు అమెరికా నాయకత్వం వహిస్తున్నది. భద్రతాసంఘంలో గూడా అంతే. ఇదివరకు కాశ్మీర్‌ను గురించిన అన్ని తీర్మానాలను ఈ అమెరికా వ్యాసుచేయించింది. ఈతగాదాలో ఒకపక్షంగావున్న పాకిస్తాన్‌కు ఇప్పుడు ఆయుధాలు అదిస్తోంది. పాకిస్తాన్ అమెరికా ఏది చెబితే అది చేస్తున్నది. ఇదంతా ఆలోచిస్తే అమెరికా ఏదో ఉద్దేశాన్ని పెట్టుకునే, ఆదినుంచి పాకిస్తాన్‌కు అనుకూలంగా వ్యవహరిస్తూ వచ్చిందని తేలుతున్నది. అందువల్ల ఇప్పుడుగనుక సమితిలో ఈ కాశ్మీర్‌ను గూర్చిన చర్చ ప్రారంభమైతే, ఇండియా ఈ పాక్ అమెరికా సైనికసంధిని ఉదాహరించి, అమెరికాను, పాకిస్తాన్‌ను గూడా ఒక బోనెక్కి తెచ్చేఎత్తు కన్పిస్తున్నది. అదీకాక ఈ సంధిని మాపించి, ఆ దృష్టితో ఈ తగాదాను విచారించాలని ఇండియా భద్రతా సంఘాన్ని కోరితే, ఇంతవరకు తానేదో దెబ్బతినటట్లు నటిస్తున్న పాకిస్తాన్ నటన అంతా బట్టబయలైపోతుంది.

అందువల సమితి పరిశీలకులు నెహ్రూ-అలీల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో భారత ప్రధాని పేర్కొన్న ఈ అంశాలు చాలా ముఖ్యమైనవని వీరు అంటున్నారు. (1) ఒకప్పుడు ఇండియామీద సైనిక చర్యలకు దిగిన పాకిస్తాన్‌కు అమెరికా ఇస్తున్న సైనిక సహాయంమూలంగా కాశ్మీర్‌లో సైనికోద్వాసన వ్యవహారం కొత్తరూపాన్ని ధరించింది (2) పాకిస్తాన్‌కు అమెరికా సైనిక సహాయాన్ని చెయ్యడం, అలయుధాలతో ఒత్తిడి తీసుకురావడం క్రిందకే వస్తుంది. అందువల్ల కాశ్మీర్‌లో వివరి సైన్యం ఎంత వుండాలి. అన్న విషయాన్ని మేము పూర్వం అన్నమాటలు యిప్పుడు సంబంధంలేనివై పోతున్నాయి. (3) ఇప్పుడు ఈ కొత్త బెడద ఒకటి వచ్చిపడింది కాబట్టి, కాశ్మీర్‌లో ఎంత సైన్యాన్ని వుంచాలి! ఎటువంటి ఆయుధాలనుంచాలి? ఆనేవిషయాన్ని ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం వుండితీరాలి. (4) పాకిస్తాన్‌కు అమెరికా చేస్తున్న సహాయంవల్ల ఒక్క కాశ్మీర్ పరిస్థితే గాక, ఆసియాలో శాంతి ప్రాంతాన్ని నిర్మించడానికి చేస్తున్న ప్రయత్నాలు కూడా దెబ్బతిని పోతున్నాయి. (5) కాశ్మీర్ వ్యవహారం అగ్రరాజ్యాల [illegible] పడితే,

## న్యూయార్కు విలేఖరుల ప్రశ్నకు పాక్ ప్రధాని జవాబు

న్యూయార్కు, అక్టోబరు 5: నేడు న్యూయార్కులో పత్రికా విలేఖరులు కాశ్మీర్ సమస్యను భద్రతాసంఘం ముందు వుంచుతారా అని అడగ్గా "వుంచవచ్చు" అని పాక్ ప్రధాని మహమ్మదాలీ జవాబు చెప్పాడు.

ఇదే గోష్ఠిలో మాట్లాడుతూ పాక్ విదేశాంగ మంత్రి సర్ జఫ్రుల్లాఖాన్ ఈ సమస్యనుగూర్చి చర్చించాలని తాము ఇంకా భద్రతా సంఘాన్ని అధికారికంగా అర్థించి వుండలేదని చెప్పాడు.

ఒక్క ఇండియా, పాకిస్తాన్‌లే కాక, కాశ్మీర్ ప్రజలు కూడా విసికిపోతారు. నెహ్రూ ఇంత చెప్పిన తర్వాత ఈ సమస్యను భద్రతాసంఘం ముందుకు తెస్తే, పాకిస్తాన్ తాను ఆడుతున్న నాటకాన్ని ఆడటం అంతగా సాధ్యపడక పోవడమేగాక, ఈ వ్యవహారంలో ఆదినుంచీ అమెరికా పాకిస్తాన్‌లు లాలూచీగా వ్యవహరించినట్లు వ్యక్తం అవుతుంది.

ఈ కాశ్మీర్ వ్యవహారంలో తేలకుండా మిగిలిపోయిన తగాదా అద్భుత యుద్ధవిరమణ సరిహద్దుకు ఇటు అటు ఎంత ఎంత సైన్యం వుండాలన్న అంశాన్ని గురించింది. ఈ విషయాన్ని గురించి మధ్యవర్తి డా॥ గ్రహాం తన రిపోర్టులో ఒక ముఖ్యమైన విషయాన్ని పేర్కొనివున్నారు. ఈ సైన్యాలను తేల్చడంలో, ఈ సైనికోద్వాసనకు సంబంధించిన ఇంకా అనేక అంశాలను దృష్టిలో పెట్టుకోవాలని వ్రాశారు. ఈ సైన్యాలు ఎంత ఎంత వుండాలి అన్న దేగాక, ఎందుకువుండాలి అన్న దాన్ని గూర్చి పరిశీలించాలని వ్రాశారు. పాకిస్తాన్ ఈ పరిశీలన అనవసరమని వాదించింది కాని ఇండియామాత్రం కాశ్మీర్‌ గురించి ఎట్టిచర్చలు జరిగినా, ఈ అంశం ఆధారంగానే జరగాలని వివరం చేసివుంది. అందువల్ల ఇప్పుడు గనుక, ఈ కాశ్మీర్ సమస్య భద్రతా సంఘానికిపస్తే, ఇండియా ఈ వాదం మరింత బలపడి పూరుకుంటుంది.

ఇప్పుడు ఈ సమస్య చర్చకువస్తే, అమెరికా ఇందులో సంబంధంవున్న పక్షంక్రింద తేలుతుంది. ఎందుచేతనంటే, పాకిస్తాన్‌కు ఈ అమెరికా ఆయుధాలుఇచ్చి బలపరుస్తున్నది. అయితే సమితి ధర్మప్రణాళికలో 6వ ప్రకరణాన్ని అనుసరించి సంబంధం వున్న పక్షంగూడా ఎటువంటితీర్మానం మీద నైనా ఓటు చేయవచ్చునని పరిశీలకులు అంటున్నారు.

## నైరృతి ఆఫ్రికా పరిస్థితి ధర్మకర్తృత్వప్రాంతమే నని ఇండియా వాదన

న్యూయార్కు, అక్టోబరు 6: దక్షిణ ఆఫ్రికా ఎంత కాదంటున్నప్పటికీ నైరుతిఆఫ్రికామాత్రం ధర్మకర్తృత్వ ప్రాంతమేనని ఇండియా నిన్న సమితి ధర్మకర్తృత్వ సంఘంలో ఉద్ఘాటించింది. నైరృతి ఆఫ్రికాను దక్షిణాఫ్రికాకు అప్పగించేటప్పుడు దానిని ధర్మకర్తృత్వప్రాంతంగా పేర్కొనిన్నూ నానాజాతి సమితి చేసిన నిర్ణయం ఇంకా అమలులోనే ఉన్నదనీ, దక్షిణాఫ్రికా ఎంత వాదించినప్పటికీ దాని ఆయుష్షు ముగిసిపోదనీ భారతప్రతినిధి ఎ. ఎస్. లాల్ ఉద్ఘాటించారు. నానాజాతి సమితి నిర్ణయాన్నే గుర్తిస్తే ఇంక నైరుతి ఆఫ్రికాలో దక్షిణాఫ్రికాకు ఎటువంటిస్థానమూ లేదని అంగీకరించవలసి వస్తుందనికూడ ఆయన ఉద్ఘాటించారు.

సోమవారంనాటి చర్చలో దక్షిణాఫ్రికా ప్రతినిధి సోల్ మాట్లాడుతూ నానాజాతి సమితి నిర్ణయానికి కాలదోషంపట్టిందనీ, అందువల్ల నైరుతి ఆఫ్రికా విషయంలో తమకు అంతర్జాతీయ బాధ్యతలేవీ లేవనీ అన్నారు. దానికి భారత ప్రతినిధి నిన్న ఈ విధంగా జవాబిచ్చారు.

పాకిస్తాన్ ప్రతినిధి ఫేదాఖాన్ మాట్లాడుతూ దక్షిణాఫ్రికా సమితి సర్వసభ్య సభతోకానీ, ధర్మకర్తృత్వ సంఘంతోకానీ సహకరించకుండా మొండితనం చూపుతున్నదనిఅన్నారు.

నైరుతిఆఫ్రికా పాలన విషయమై తాను ఐక్యరాజ్యసమితికి నివేదించవక్కర్లేదని లోగడ దక్షిణాఫ్రికా వాదించగా, ధర్మకర్తృత్వ సంఘం అంతర్జాతీయ న్యాయస్థానానికి ఫిర్యాదుచేసింది. అన్యాయస్థానం దానిని పరిశీలించి, నానాజాతిసమితికిఉన్న పర్యవేక్షణాధికారాలన్నీ ఐక్యరాజ్య సమితికి వచ్చినట్లు తీర్పుచెప్పింది. అయితే ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణ పరిధి నానాజాతిసమితి అను పర్యవేక్షణను మించివుండరాదనీ, ధర్మకర్తృత్వాన్ని అమలు జరపటంలో నానాజాతిసమితి అనుసరించినపద్ధతినే ఐక్యరాజ్యసమితి కూడా అనుసరించాలని అంతర్జాతీయ న్యాయస్థానం నిర్దేశించింది.

నానాజాతి సమితి నిర్ణయాలన్నీ ఏకగ్రీవాభిప్రాయంమీద జరిగినవి. ఐక్యరాజ్యసమితి నిర్ణయాలకు మూడింట రెండువంతుల సంఖ్యాబలం చాలు. రెండవపద్ధతిని దక్షిణాఫ్రికా సమ్మతి మీద అనుసరించటానికి ధర్మకర్తృత్వ సంఘం నిశ్చయించింది. దక్షిణాఫ్రికా సమ్మతించకపోతే, తిరిగి ఆఅంశాన్ని కూడా అంతర్జాతీయ న్యాయస్థానానికి ప్రతిపాదించటం జరుగుతుంది.

## సింహళ భారతీయుసమస్య

### కొటేలవాలఆశాభావం

### బెంబైకి ప్రతినిధివర్గం రాక

బొంబాయి, అక్టోబరు 6: ఢిల్లీలో ప్రధాని పండిత నెహ్రూతో సంభాషించిన మీదట ఇండో-సింహళ సమస్యలన్నిటి తుదిపరిష్కారంతో కొలంబో తిరిగి వెళ్ళ వీలవుతుందని ఆశిస్తున్నాను' అని ఈ వేళ యిక్కడికివచ్చిన సింహళప్రధాని సర్ జాన్ కోటెలవాలా పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ అన్నారు.

'భారతదేశంలో నాకు చాలామంది మిత్రులు వున్నారు. మా రాయబార వర్గంలో దేశమునందలి అన్ని అభిప్రాయాలను ప్రతిబింబించేవారు వున్నారు. ఢిల్లీలో వప్పందం కుదరడంకష్టంకాదని విశ్వసిస్తున్నాను'అనితనసేవనకాయగా వున్న సింహళ భారతీయ సమస్యపై ప్రధాని నెహ్రూతో చర్చింపవచ్చిన రాయబార నాయకుడు కోటెలవాలా వివరించారు.

### సుస్వాగతం

బొంబాయిగవర్నరు శ్రీగిరిజాశంకర బాజ్‌పాయ్, ముఖ్యమంత్రి మురార్జీ దేశాయి మున్నగు ప్రముఖులు కోటెలవాలాకు స్వాగతం చెప్పారు. భారత నౌకాదళంవారి గౌరవాభివందనాలను అందుకున్న మీదట కోటెలవాలా ఈ భవనానికి వెళ్ళారు. అక్కడ ప్రభుత్వఅతిథిగా రెండురోజులు వుంటారు. పండిత నెహ్రూ గూడా గవర్నరు నివాసమైన రాజ్ భవనంలోనే బస చేస్తున్నారు. అక్టోబరు 8న ఉభయులు కలసి ప్రత్యేక విమానంలో ఢిల్లీ వెళ్తారు.

### ఇతర రాయబారుల ప్రకటనలు

ఢిల్లీ సమావేశంలో ఇండో-సింహళ సమస్య సర్వతోముఖంగా చర్చించబడుతుందని మాజీ సింహళప్రధాని డడ్లీ సేనానాయకే తెలిపారు. ఈ సమస్యపై ప్రధాని నెహ్రూతో చర్చించే అవకాశం గత సంవత్సరం లండన్‌లో కలిగిందని ఆయన అన్నారు.

రాయబార వర్గమునందలి మరొక సభ్యుడు సింహళ విదేశాంగ కార్యదర్శి డీ సౌజా మాట్లాడుతూ ఇండియా-సింహళాలమధ్య యిటీవల అనేక భేదాభిప్రాయాలకు కారణభూతమైన నిర్వాసుల సమస్యలే ముఖ్యం వహిస్తుందని తెలిపారు.

ఈ రాయబారవర్గంలో ఇతర సభ్యులు: సింహళ పార్లమెంటులో ప్రతిపక్షనాయకుడుబండార్‌నాయకే, విద్యాశాఖమంత్రి బండా, న్యాయశాఖమంత్రి విక్రమనాయకే, వాణిజ్యశాఖ ఆక్టింగ్‌మంత్రి వి. నల్లయ్య గారలు, సింహళప్రధాని కార్యదర్శి శ్రీ పి. నడేశన్ ఇతర అధికారులు సలహాదారులు రాయబారవర్గంలో వచ్చారు.

* * *

### భారతదేశ వాదం

న్యూఢిల్లీ, అక్టోబరు 6: సింహళమునుండి 2 రోజులలో ఇక్కడికి రానున్న అత్యున్నతాధికార రాయబారవర్గానికి, అపూర్వమైన సుస్వాగతం ఒసంగబడనున్నదని టి. టి. ఐ. ప్రత్యేక విలేఖరి వ్రాస్తున్నాడు.

సింహళంలో నివసించే భారతీయులవిషయమై చర్చించడానికి ఈసభ జరగాలని సింహళ ప్రభుత్వం అర్థించింది.

గత జనవరిమాసంలో చేసుకున్న ఇండో-సింహళ వప్పందాన్ని సింహళం అమలు చేయలేదని భారత ప్రభుత్వం వాదిస్తున్నది. వప్పందానికి భిన్నమైన అనేక పనులు సింహళ ప్రభుత్వం చేసింది.

అగస్టులో పరిశీలించిన 4,500 పౌరసత్వ దరఖాస్తులలో 310 మాత్రమే అంగీకరించారు. ఈవిధంగా వప్పందాన్ని అమలుచేస్తున్నందుకు ప్రధాని నెహ్రూ వే.అసంతృప్తి వెల్లడించారు. ఐనప్పటికీ, సింహళ ప్రభుత్వ కష్టాలనుగూడా ఇక్కడ గ్రహిస్తున్నారు. ప్రతిపక్షాలవారు సింహళ భారత సమస్యను రాజకీయ సమస్యగా చేసి, ప్రభుత్వాన్ని విమర్శించడానికి దాన్ని ఉపయోగిస్తున్నారని ఇక్కడ గుర్తిస్తున్నారు. సింహళ ప్రభుత్వం ఇదివరకు కంటె న్యాయంగా ఈ వప్పందాన్ని అమలుచేయడానికి ఢిల్లీ సంభాషణలు సాధనభూతంగా వుండగలవనే ఆశను పరిశీలకులువెల్లడిస్తున్నారు.

## 'పల్లెప్రజలకు దేశీయ వైద్యమే శరణ్యం'

### ప్రొద్దుటూరు ఆరోగ్య సంఘంవారి విజ్ఞప్తి

ప్రొద్దుటూరు, అక్టోబరు 8: నేటి పల్లె ప్రజలకు దేశీయ వైద్యమే శరణ్యం వైద్య విద్యకు దాదాపు పదివేలు వెచ్చించి పట్టాన్ని పొంది పట్టణవాసములకు, పెద్ద ఫీజులకూ, సుఖాల సత్యాలకూ అలవాటుపడ్డ అల్లోపతి వైద్యులు పల్లెటూళ్లకుపోరు. కొందరు పోయినా బీదప్రజలకు అందుబాటులో ఉండరు. అందులకే పల్లెప్రజల ఆరోగ్యం పూర్తిగా దేశీయ వైద్యులపైననే ఆధారపడి ఉన్నది, అని ప్రొద్దుటూరు జాతీయ కుటుంబని యంత్రణ,ఆరోగ్య సంఘంవారు ఆంధ్రరాష్ట్ర ఆరోగ్య శాఖా మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారికి ఒక వినతిపత్రం సమర్పిస్తూ పేర్కొన్నారు. వారు ఆ వినతిపత్రంలో కొన్ని సూచనలు చేశారు. అవి:

ప్రభుత్వం ప్రజల ఆరోగ్యభాగ్యానికై ఆరోగ్య సూత్రాలను బోధించే వైద్యప్రచారకులను తాలూకాకు ఒక్కరినైనా వెంటనే నియమించాలి; భోర్ కమిటీ సలహా ననుసరించి, ఏర్పాటు చేయబడిన గ్రామ వైద్య శిక్షణ ప్రణాళికను విస్తరించి అమలు జరపాలి. అయితే 6 నెలలకాల పరిమితి చాలదు; 'బి' తరగతి రిజిస్ట్రేషను పొందిన ఆయుర్వేద వైద్యులకు సంవత్సరకాలం అల్లోపతి వైద్యంలో శిక్షణ నిచ్చి ఎ. యల్. ఐ. యం. (అసోసియేట్ యల్. ఐ. యం.) డిప్లొమా ఇవ్వాలి. వారిని ప్రతి పంచాయతీ గ్రామంలో వైద్యులుగా నియమించాలి.

ప్రతి తాలూకా కేంద్ర ఆస్పత్రిలోను 'ఎక్స్‌రే' 'లేబరేటరీ' మొదలైన చికిత్సలను ఏర్పాటు చేయాలి; జాతీయ వైద్యుల కొరకు కేంద్రబోర్డు ఏర్పరచి, బొంబాయి ప్రభుత్వంవారి 1938 సం॥ చట్టంవంటిదాన్ని చేయాలి; తిరుపతి, గుంటూరులలో జాతీయ వైద్య పాఠశాలలు వెంటనే ప్రారంభించాలి. ఆంధ్రదేశములోని అన్ని మాతా శిశు సంరక్షణ కేంద్రాలలోని వైద్యులకు కుటుంబ నియంత్రణంగురించి ప్రత్యేక శిక్షణ నొసగి ప్రజలకు ఉచిత సలహాలను ఇచ్చే ఏర్పాటు చేయాలి; 2, 3 వ తరగతుల పురపాలక సంఘాలలో పది సంవత్సరాలకు పైబడిన అనుభవంగల శానిటరీ ఇన్‌స్పెక్టర్లకు ఒక సంవత్సరం అల్లోపతి వైద్యంలో ప్రత్యేక శిక్షణ నిచ్చి, వారిని హెల్తు ఆఫీసర్లుగా నియమించవచ్చును. ఇందువలన ప్రభుత్వ వ్యయం కూడా తగ్గుతుంది.

## బీమడోలు ధర్మాసుపత్రి

భీమడోలు, అక్టోబరు 1. భీమడోలు గ్రామంలో సరియైనవైద్యసహాయం బీదలకు లభించకపోవటంచేత భీమడోలు శివారులింగంపాడు, అక్కడివారి గూడెం హరిజన పెద్దలు ఒక ధర్మాసుపత్రిని స్థాపించుకున్నారు. ఇందుకుగాను వారికి శ్రీయుతులు సి. యం. యస్. ఛైర్మన్, కె. యస్. సంజీవి, డా॥ యస్. మార్కండేయశాస్త్రిగారలు సహాయపడ్డారు. కూలిచేసి సంపాదించిన దినభత్యంలో కొంత మిగిల్చి స్థాపించుకున్న దీన్ని నడుపుకోవటం చాలా కష్టంగా ఉన్నదనీ, కనుక ప్రభుత్వంవారు తగు సహాయం చేయాలని కోరుతూ ఆ ధర్మాసుపత్రి నిర్వహణసంఘం అధ్యక్షులు శ్రీ జి. జోసెఫ్ గారు ఆంధ్రప్రభుత్వ అభివృద్ధిశాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారికి ఒక విజ్ఞప్తి సమర్పించారు.

## రాజమండ్రిలో పేదవారికి ఆస్పత్రి

### మంత్రి విశ్వనాథంగారిచే ప్రారంభోత్సవం

రాజమహేంద్రవరం, అక్టోబరు 5: ఆర్థిక మంత్రి తెన్నేటి విశ్వనాథం గారు నిన్న ఉదయం ఇక్కడ బీదలూ, వికలాంగులకోసం ఉద్దేశమైన ఒక ఆస్పత్రికి ప్రారంభోత్సవం జరిపారు.

కోనల సూర్యరాజుగారు దానంచేసిన స్థలంలో స్థానిక రామకృష్ణమఠంవారి సాయంతో గౌతమీ జీవకారుణ్యసంఘంవారు ఈ ఆస్పత్రిని కట్టించారు.

ఉదారంగా విరాళాలిచ్చి ఈ సంస్థను తోడుపడవలసిందిగా విశ్వనాథం గారు ప్రజలకు విజ్ఞప్తిచేశారు. ప్రభుత్వసహాయానికిగూడ ఆయన హామీయిచ్చారు.

## చాకరీ ఈనాంలకు శిస్తునిర్ణయ ప్రతిపాదన

### ప్రభుత్వపరిశీలన

కర్నూలు, అక్టోబరు 2: చాకరీ ఈనాంలకుకూడా ప్రభుత్వ జిరాయితీ భూములకు మాదిరిగానే శిస్తు నిర్ణయించే ప్రతిపాదనను రాష్ట్రప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నదని అతి విశ్వసనీయంగా తెలియవచ్చింది. దీనిమూలంగా ప్రభుత్వానికి దాదాపు పలక్షలరూపాయల అదనపు ఆదాయం రాగలదనికూడా తెలుస్తున్నది.

ప్రభుత్వం ప్రస్తుతం ఎదుర్కొంటున్న లోటునూ, చిన్న వ్యవసాయదారులకు ప్రభుత్వం కల్పించ దలచిన పన్నుబాధా నివారణ సౌకర్యం ద్వారా ఏర్పడే లోటునూ, రాష్ట్ర ప్రభుత్వం భర్తీ చేయుటానికి ఉద్దేశించిన మార్గాలలో ఈ చర్య ఒకటని అనుకుంటున్నారు.

# కావలి వీధిదీపాలకు విద్యుచ్ఛక్తి సప్లయి

### శ్రీ గోపాలరెడ్డిగారిచే ప్రారంభోత్సవం

కావలి, అక్టోబరు 8: "మన దేశం వైద్యులు, న్యాయవాదులు వల్ల కాక, ఇంజనీర్లవల్లనే బాగుపడవలసి ఉంది. రాష్ట్ర ప్రభుత్వం విద్యుచ్ఛక్తి విస్తరణ పట్ల శ్రద్ధ చూపుతోంది. మా వైజ్ఞానికాభివృద్ధికి కళాశాలనూ, పారిశ్రామికాభివృద్ధికి విద్యుచ్ఛక్తిని, సబ్ కోర్టును సంపాదించింది. మా పురోభివృద్ధికి ఇది తొలిమెట్టు" అని ఇక్కడ వీధి విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేస్తూ బెజవాడ గోపాలరెడ్డి గారు ఉద్ఘాటించారు.

మాచ్‌ఖండ్ ప్రాజెక్టు పూర్తి అయితే ఆంధ్రులు తమిళులకన్నా అధిక సంపదలను పొందితీరుతారన్నారు.

కావలి వీధి విద్యుద్దీపాల ప్రారంభోత్సవం ఆంధ్రరాష్ట్ర తొలివార్షికోత్సవ సందర్భాన లక్ష్మీ టాకీస్‌లో జరిగింది. బత్తెన రామకృష్ణారెడ్డిగారు సభకు అధ్యక్షత వహించారు.

పంచాయతీ బోర్డు అధ్యక్షులు పి. వీరరాఘవులుగారు అతిథులకు పూలమాలతో స్వాగతమిచ్చారు. రామకృష్ణారెడ్డి, గోపాలరెడ్డి గారలకు పౌరుల పక్షాన స్వాగతపత్రాలు సమర్పించారు.

సభా ప్రారంభాన రామకృష్ణారెడ్డి గారు మాట్లాడుతూ పొట్టి శ్రీరాములు గారికి జోహార్లు అర్పించారు. కావలి కోలువ విషయం మాట్లాడుతూ, దాని కయే ఖర్చులో సాల్గో వంతు రైతులు భరిస్తే, ప్రభుత్వం త్వరలోనే మిగతా సహాయం చేస్తుందన్నారు.

విద్యుచ్ఛక్తి శాఖా సూపరింటెండెంటు ఇంజనీర్ టి. కృష్ణస్వామి గారు మాట్లాడుతూ కావలినగరంలో విద్యుద్దీపాల ఏర్పాటు పని డిసెంబరులోగా పూరాగా సంపూర్తి కాగలదన్నారు.

బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రారంభోత్సవం చేస్తూ విద్యుద్దీపాల విస్తరణ విషయంలో ఇంజనీరింగ్ శాఖ చూపుతున్న శ్రద్ధను ప్రశంసించారు. ప్రజలందరూ కలిసి ప్రభుత్వానికి సహాయపడితే, త్వరలో చాలా కాలం శ్రమను సాధించగలమన్నారు.

శ్రీ పుచ్చలపల్లి వెంకట సుబ్బారెడ్డి గారి ఛాయాచిత్రాన్ని ఆవిష్కరిస్తూ గోపాలరెడ్డి గారు వారిని విద్యార్థులు ఆదర్శంగా తీసుకోవాలన్నారు. న్యాయవాదులు పసుమర్తి సత్యనారాయణ, యమ్. యస్. ఆర్. ఏ. గుప్త గారలు సుబ్బారెడ్డి గారిని ప్రశంసించారు. పి. వీరరాఘవులుగారు అల్పాహారవిందు చేశారు.

అనంతరం హైస్కూలు ప్లేగ్రౌండులో జరిగిన బహిరంగసభలో గోపాల రెడ్డి గారు ప్రస్తుత కాంగ్రెసు వ్యవహారాలను గూర్చి, గాంధీ జయంతిని గూర్చి చెప్పారు.

రామన్న శాసనసభలో ప్రభుత్వం మీద విశ్వాసరాహిత్య తీర్మానం నెగ్గి గవర్నర్ పరిపాలన ఏర్పడితే తీరని నష్టం కలుగుతుందన్నారు. కాంగ్రెసువారెన్నడూ మద్యపానాన్ని అనుమతించబోదన్నారు. పట్టుకుని అంగీకరించబోరని స్పష్టపరిచారు. ప్రజలు ప్రభుత్వానికి సహకరించాలన్నారు. తాము, శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి ప్రభృతులు సోమశిల ప్రాజెక్టుకు కృషి చేస్తున్నామనీ, అది నెరవేరితే నెల్లూరు జిల్లా సస్యశ్యామలం కాగలదన్నారు.

అనుమలశెట్టి వెంకటేశ్వర్లుగారి వందనాలతో సభముగిసింది. స్వ. వి.

## తాడిపత్రి తంతి తపాలాపనివారల సభ

తాడిపత్రి, అక్టోబరు 1: తాడిపత్రి పోస్టాఫీసు ఆవరణలో తంతితపాలాపనివారలసంఘ సమావేశం గత నెల 29 వ తేదీన టి. నరసింహాచార్యులుగారి అధ్యక్షతన జరిగింది. డి. కె. వెంకోబరావు, పోస్టుమాస్టర్ రంగరావుగారలు సంఘాన్ని గురించి మాట్లాడారు. ఇక్కడుండు పోస్టుమన్ వెంకటప్పగారికి గుమాస్తాపని వచ్చినసందర్భంలో వారికి సంఘంవారు తేనీటివిందు ఇచ్చారు. డి. కె. వెంకోబరావు, నరసింహాచార్యులుగారలు ఆయన్ని ప్రశంసించి అభినందించారు. (స్వ. వి.)

## చిత్తూరులో హైస్కూలు వార్షికోత్సవం

చిత్తూరు, అక్టోబరు 2: స్థానిక కర్నూ హైస్కూలు సప్తమ వార్షికోత్సవం నేటి సాయంత్రం జరిగింది. జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ యం. జేవిడ్ గారు అధ్యక్షత వహించారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ రాజమునిస్వామిగారు వార్షిక నివేదిక చదివారు. తరువాత బహుమతి ప్రదానం, నాటక ప్రదర్శనం జరిగాయి.

## భీమవరం హైస్కూలు పాత విద్యార్థుల సభ

భీమవరం, సెప్టెంబరు 29: ఎస్. కె. జి. ఎస్ హైస్కూలు పాతవిద్యార్థుల సంఘకార్యవర్గం 26 వ తేదీన పాఠశాలలో సమావేశమై వార్షికోత్సవం అక్టోబరు 30,31 తేదీలలో జరుపనిశ్చయించిందనీ, కార్యదర్శి సేరకనీసం ఒక రూపాయి ఈలోగా పాత విద్యార్థులు పంపాలని సంఘ కార్యదర్శి సి. హెచ్. కోటనారాయణ గారు తెలియజేస్తున్నారు.

## కొల్లేటి రైతులసభ

కైకలూరు, సెప్టెంబరు 25: ఏలూరు కైకలూరు తాలూకా కొల్లేటి రైతుల మహాసభ వెల్లంకి విశ్వేశ్వరరావుగారి అధ్యక్షతన కొల్లేటికోటలో 23 వ తేదీన జరిగింది. ఆహ్వానసంఘ అధ్యక్షులు సైదు గంగరాజుగారు స్వాగతమిచ్చారు. కొల్లేటిభూములను ఇంజన్ దార్లకివ్వటం అన్యాయమని అధ్యక్షులు అన్నారు. సైదు గంగరాజు, అన్నె వెంకటేశ్వర రావు గారలు కొల్లేటిరైతుల సమస్యలనుగురించి వివరించారు. అనేకమందిరైతులు తామే ఇంజన్లు కొనటానికి ప్రయత్నిస్తామన్నారు. కొండపల్లి రాఘవరావు గారు ఇంజన్లు తెచ్చుకోవలసిన ఆవశ్యకతను వివరించారు.

రైతులే స్వయంగాగాని, అద్దెకుగాని యింజను తెచ్చుకుంటే భూమి రైతులకే మంజూరు చెయ్యాలనీ, కొల్లేటిభూములను బంజరు పంపకంలో చేర్చాలనీ, కొల్లేటి ప్రాంతాలలో ఎఫ్. ఎల్. సి. సంఘాలు ప్రారంభించాలనీ, ఉప్పుటేరుకు రెగ్యులేటర్ కట్టాలనీ, రామమూర్తి కమిటీ నివేదికను అమలుపర్చాలనీ, ఏలూరు, కైకలూరురోడ్డుమధ్యనున్న పెదయెడ్లగాడి, చిన ఎడ్లగాడులకు వంతెనలు నిర్మించాలనీ తీర్మానించారు.

గంజి రామారావుగారి అధ్యక్షతన రాత్రి బహిరంగసభ జరిగింది. అన్నె వెంకటేశ్వరరావు, వెల్లంకి విశ్వేశ్వరరావు, మొటపర్తి కూనేరావు, కొండపల్లి రాఘవరావు; అట్లూరి పుర్ణానల పతిరావుగారలు మాట్లాడారు.

## జగ్గయ్యపేట పంచాయతీ సమావేశం

జగ్గయ్యపేట, సెప్టెంబరు 25: జగ్గయ్యపేట పంచాయతీబోర్డువారు అధ్యక్షులు సామినేని విశ్వనాథంగారి అధ్యక్షతన ఈరోజు మధ్యాహ్నం 3 గంటలకు సమావేశమై కందిబండ పిచ్చయ్య, యేపూరి కనకయ్యగారలు తమ సభ్యత్వపదవి రిస్టోర్ చేయమని పెట్టుకొన్న దరఖాస్తును అంగీకరించారు. నాలుగవ బిల్లుకలెక్టర్ పనిని మంజూరు చేశారు. మోటారు స్టాండు చుట్టూ గ్రావెల్ వేయుటకు, బజారులో గ్రావెల్ వేయుటకు అంచనాలు అంగీకరించారు. పంచాయతీ బండ్లు, ఎద్దులు ఉండుటకు పంచాయతీ పార్కులో ఒక షెడ్డును నిర్మించుటకు చేస్తూ, మరికొన్ని తీర్మానాలు చేశారు. (స్వ. వి.)

## త్రివేణి రజతోత్సవం తేదీ మార్పు

బెంగుళూరు, అక్టోబరు 1: ఈ నగరమందలి తెలుగు సాహితీసమితి కార్యదర్శి శ్రీ వి. వి. కృష్ణయ్యగారిలా వ్రాస్తున్నారు. "త్రివేణి" పత్రికకు రజతోత్సవము, ఆ పత్రికా సంపాదకులైన శ్రీకోలవెన్ను రామకోటేశ్వరరావు గారికి సన్మానము విజయదశమి (7 వ తేదీ) బెంగుళూరులో జరుపబడుతుందని లోగడ పత్రికాముఖమున ప్రచురించి యున్నాము. కొన్ని అనివార్య కారణాలవల్ల ఆ కార్యక్రమాన్ని విజయదశమినాడుగాక అక్టోబరు 30 తేదీన జరుపవలెనని యిప్పుడు నిర్ణయించాము.

## గుంటూరులో అతివృష్టి బాధ

### 500 కుటుంబాలకు నష్టం

గుంటూరు, అక్టోబరు 8: ఇటీవల వానల ఫలితంగా గుంటూరుపట్టణంలో కొన్ని ప్రాంతములలో జరిగిన నష్టములను గూర్చి పట్టణకాంగ్రెసు ఉపాధ్యక్షుడు, పురపాలకసంఘ సభ్యులు అయిన శ్రీ వరికూటి వెంకటరెడ్డిగారు యిలా తెలుపుతున్నారు:

"గుంటూరు పట్టణములో 26, 27 తేదీలలో కురిసిన వర్షమువల్ల యర్రచెరువు, నల్లచెరువు, పిచ్చికలగుంట వగయిరా చెరువులకు గండ్లుపడి పల్లపు ప్రదేశములలో వున్న గుడిసెలన్ని జలమయమై పోయినవి.

తెనాలి రోడ్డు మంగళగిరిరోడ్డు తెనాలి రైలుకట్ట బొంగరాలబీడు, బుచ్చయ్యతోట, పాతగుంటూరు, అశోకపేట హరిజనవాడ మొదలగు పల్లపు ప్రదేశములలో చెరువులక్రింద వున్న పూరిపాకల పేదకుటుంబాలకు నిలవడానికి నీడలేక తీరని నష్టముసంభవించింది. ఇలా నష్టమునకు గురియైన కుటుంబాలు దాదాపు 500 ఉంటవి. నిరాశ్రయులైనవారు రోడ్లవెంబడి చెట్లక్రింద కాపురాలు చేస్తావున్నారు. కొన్ని గుడిసెలు యిండ్ల కప్పులతో సహా నీట మునిగి వరదలో కొట్టుకపోయి, కట్టుబట్టలతో ప్రాణాలు దక్కించుకొని బయటకు చేరిన కుటుంబాలనేకం ఉన్నవి.

ఈ విషయమై స్థానిక అధికారులకు రిపోర్టులుకూడా చేసియున్నారు. కాని యింతవరకు స్థానిక అధికారులు చూచి విచారించి వరదలో నీట మునిగిన కుటుంబాలవారికి ఏమియు సహాయము చేసియుండకపోవటము విచారకరము. ఇంకా పదిరోజులవరకు కొన్ని పేటలలో నీరు నిలచి యిండ్లు మరామత్తు చేసుకొనేదానికి, వీలుండదు. యీపరిస్థితులలో స్థానిక అధికారులు చురుకుగా పనిచేసి, నీట మునిగిన కుటుంబాలవారికి వురల గృహవసతి కల్పించడానికి తక్షణచర్యలు తీసుకొనవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

## తుంగభద్ర వంతెనకు దెబ్బ

సంగంజాగర్లమూడి, అక్టోబరు 4: సంగం జాగర్లమూడినుంచి పాలడుగు సంగయ్యగారిలా వ్రాస్తున్నారు:

"తెనాలి, నారాకోడూరు రోడ్డుపై అంగలకుదురువద్దనున్న తుంగభద్రవంతెనపై రంధ్రాలుపడి కూలిపోయే స్థితిలో నున్నది. లోకల్ ఫండువారు సుమారు రెండుసంవత్సరాలక్రితం "అపాయము వంతెనపై బరువుబండ్లు పోరాదు" అనే బోర్డు తగిలించి వారి బాధ్యత తీర్చుకొన్నారు. మొన్న కురిసిన అధికవర్షాలవల్ల వంతెన మరీ దెబ్బతిన్నది. కావున అధికారులు శ్రద్ధవహించి వంతెన బాగుచేయించ గోరుచున్నాను.

## తణుకు తాలూకాలో బుడమపంటకు దెబ్బ

తణుకు, అక్టోబరు 1: తణుకు తాలూకాలో ఇటీవల కురిసిన కుంభవృష్టి కారణంగా తాలూకాలోని అనేకగ్రామాలు జలమయమైనవి. పల్లపు ప్రాంతాలలోని యిండ్లు, ముఖ్యంగా గోస్తనదీకాల్వవారయిండ్లు జలమయమైనవి. పనమీదనున్న బుడమ పంట బాగా దెబ్బతింది. సుమారు పదిదుక్కుల వర్షం తణుకులో పడింది.

తెనాలి, సెప్టెంబరు 29: వల్లభాపురం పంచాయతీవారు యీమధ్య ప్రతిపాదించిన మంచినీటి సరఫరా పంపింగు స్కీమును ప్రభుత్వ స్థానికాభివృద్ధి శాఖవారు పంచవర్ష ప్రణాళికలో చేరుస్తూ, మంజూరు చేశారని పంచాయతీ అధ్యక్షులు బానిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు తెలియజేశారు. (స్వవి)

# మతకల్లోలాలకు విరుగుడుగా భారతకాంగ్రెసు ప్రతిపాదన

## హైద్రాబాద్ కాంగ్రెస్ ప్రాతికూల్యం

హైదరాబాదు, అక్టోబరు 6: మతకల్లోలాలను అరికట్టడం నిమిత్తం ప్యూనిటివ్ పన్ను విధించడానికి అఖిలభారత కాంగ్రెస్ గావించిన సూచనను హైదరాబాదు ప్రదేశకాంగ్రెసు కార్యవర్గసభ్యులు కొందరు వ్యతిరేకించినట్లు తెలుస్తున్నది.

ఇటువంటి చర్య అమాయకులను చిక్కులలో పెట్టి, విద్వేషాలకు దారితీయగలదని ఆ సభ్యులు అభిప్రాయపడినట్లు చెప్పబడుతున్నది.

మతకల్లోలాలు మరి పొటమరించకుండా ప్యూనిటివ్ పన్ను విధించమంటూ అఖిలభారతకాంగ్రెస్ దేశంలోని వివిధ ప్రదేశకాంగ్రెసు అధ్యక్షులకూ, రాష్ట్ర లెజిస్లేచరు పార్టీ నాయకులకూ ఇటీవల పంపిన ఒక సర్క్యులరులో సూచించారు.

ప్రదేశకాంగ్రెసు కార్యవర్గంవారు అత్యవసర సమావేశం జరిపి ఈ సర్క్యులరు విషయమై సవిస్తరంగా చర్చించినట్లు తెలుస్తున్నది. ఆమధ్య నిజామాబాదు, గుల్బర్గాలలో జరిగిన మతకల్లోలాల తర్వాత రాష్ట్రంలోని శాంతిభద్రతల పరిస్థితినిగూడ ఈకార్యవర్గంవారు పరిశీలించారు.

కార్యవర్గంవారు ఇంతవరకూ ఎట్టి నిర్ణయానికీ రాలేదు.

## నందికొండ ప్రాజెక్టు సభ

కరివేన, సెప్టెంబరు 30: నందికొండ ప్రాజెక్టు నిర్మాణం గురించి, ఆంధ్ర ప్రభుత్వంపైనా, శాసనసభ్యులపైనా కొంతియు తీవ్రంగా ఒత్తిడి తెచ్చేందుకు అక్టోబరు 10 వ తేదీ కందుకూరులో నెల్లూరు జిల్లా నందికొండ ప్రాజెక్టు మహాసభ జరుప నిశ్చయించామని, అన్ని పార్టీలవారు మహాసభకు రావచ్చునని, నెల్లూరుజిల్లాకృషికార్ లోక్ పార్టీ కార్యదర్శి శ్రీ రావిపాటి మహానందగారు తెలుపుతున్నారు.

## క్రాసింగు స్టేషను

ఒంగోలు, సెప్టెంబరు 30: నెల్లూరు రైలుస్టేషన్ను క్రాసింగు స్టేషనుగా చేసేటందుకుగాను రెండవరైలు వేయాలనే సూచన ఆలోచనలో ఉన్నది. ఒంగోలుకు ఇది 8 మైళ్ల దూరంలో ఉన్నది. ఇది ఏర్పడితే ఒంగోలులో గూడ్సుబళ్లను ఎక్కువకాలం ఉంచవలసిన అవసరం ఉండదు. కావలి మధ్య ఉన్న గుడిపాడులో, తెట్టు ఉలవపాడుల మధ్యన ఉన్న చాకిచెర్ల స్టేషనులవద్దకూడా క్రాసింగులైను వేయాలని ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది.

